

శ్రీమతే రామానుజాయనమః

# గీతాదర్శనమే రామానుజదర్శనము




రచయిత - ప్రకాశకులు :

గోపాలాచార్య



1987

వెల : 10-00

# విషయసూచిక

పుట.

# గీతాదర్శనమే రామానుజదర్శనము

శ్లో॥ సర్వోపనిషదో గావః । దోగ్ధా గోపాలనన్దనః
పార్థో వత్స స్సుధీ ర్భోక్తా। దుగ్ధం గీతామృతం మహత్॥

అను నీసుప్రసిద్ధశ్లోకము భగవద్గీత ఉపనిషత్సారమని తెలుపు చున్నది. మరియును ప్రతియధ్యాయావసానమందును "భగవద్గీతాసు ఉపనిషత్సు" అనియును 'బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే' యనియు ననుసంధింతుము. దీనిచే భగవద్గీత ఉపనిషత్సారమనుట నిర్వివాదము. ఇట్లే రామానుజదర్శనమున్ను "తదిహాఖిల శ్రుతిమతం రామానుజీయంమత' మ్మను నార్యోక్తి ననుసరించి ఔపనిషదమే. కావున రామానుజ సంప్రదాయమునకున్ను భగవద్గీతకున్ను పోలిక నొకింత గమనింతము.

భగవద్రామానుజులకు భగవద్గీతయం దపారాదరము కలదు. వారు దీనికి భాష్యమును రచించిరి. బ్రహ్మసూత్ర భాష్యములో సూత్రములందున్న 'స్మృతి' శబ్దమునకు భగవద్గీతనే యుదహరించుచు వచ్చిరి. కావున వీరి సిద్ధాంతమంతయు భగవద్గీతను 'తుచ' తప్పక యనువర్తించుచున్నదను విశ్వాసమునకై కొన్నివిషయముల నిచ్చట పొందుపరచుచున్నాను. పాఠకులుశ్రద్ధతో గమనింతురుగాక!

రామానుజ దర్శనమునందలి యీక్రింది ప్రధానార్థములనుభగవద్గీతలోని సుస్పష్టమగు ప్రమాణములతో సమర్థించుట కుద్యమించు చున్నాను.

1. ఈదర్శనమునకు చిదచిదీశ్వరులని మూడు తత్వములు ప్రధానములు.
2. శ్రీమన్నారాయణుడే పరతత్వము.
3. ఆతడు సర్వాత్మకుడు, చేతనాచేతనము లన్నియవస్థలలోను నాతనికి శరీరభూతములు.
4. ఆతడు సకలకల్యాణ గుణాకరుడుగనే యుపాసింపదగినవాడు.
5. జగత్తుయొక్క సృష్టి, స్థితి, సంహార, ప్రవృత్తి, నివృత్తి మొదలగు వ్యాపారములన్నియు నాతని యధీనములు.
6. భగవదర్చారాధనము నిత్యకృత్యము.
7. భగవన్నివేదిత పదార్థమునే మనమెల్లప్పుడు నుపయోగింపవలెను.
8. మనము చేయు సమస్తశాస్త్రవిహిత వర్ణాశ్రమ ధర్మములను భగవత్ప్రీతి కైంకర్యబుద్ధితో ఫలసంగకర్తృత్వములను వీడి గావించుచుండవలెను.
9. దేవతాంతరములయందు పరత్వబుద్ధి పరిత్యాజ్యము.
10. జీవుల కీశ్వరునితోను పరస్పరమున్ను భేదము వాస్తవము.
11. జీవు లణుపరిమాణముకలవారై నిత్యమైయుందురు.
12. వీరికి శేషత్వ పారతంత్ర్యములు ప్రధానలక్షణములు.
13. చాతుర్వర్ణ్య వ్యవస్థ సనాతనము.
14. వర్ణాశ్రమధర్మముల నెట్టి స్థితియందును విడువరాదు.
15. భక్తిప్రపత్తులచే ప్రసన్నుడైన శ్రియఃపతియే మోక్షోపాయము

16. అర్చిరాదిమార్గమున నేగి స్వస్వరూపమునుబడసి భగవత్సా యుజ్యము నందుటయే మోక్షము.

17. అవతారరహస్య జ్ఞానమొక మోక్షోపాయము.

18. సదాచార్యుల సమాశ్రయించవలెను.

19. సదాచారమే ప్రబల ప్రమాణము.

20. సదాచార్యప్రాప్తికి మదత్రయపరిత్యాగము ముఖ్యావసరము.

21. ఆహారనియమ మనుల్లంఘనీయము.

22. గీతాసారమే సారతమ చరమమంత్రము.

## ఈదర్శనమునకు చిదచిదీశ్వరులని మూడు తత్త్వములు ప్రధానములు.

చిత్-అచిత్-ఈశ్వరుల నెడు మూడుతత్త్వములను భగవద్గీత లోని త్రయోదశ-చతుర్దశ-పంచదశాధ్యాయములు మూడును క్రమముగ విస్తారముగ వివరించుచున్నవి.

పదమూడవ అధ్యాయమునకు క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగ మని పేరు. గీతాశాస్త్రమంతయును మూడుషట్కములుగ విభాగింపబడెను.

మొదటి షట్కము: ద్వికము, చతుష్కమని రెండుభాగ ములు. ద్వికమనగా రెండధ్యాయముల సముదాయము, చతుష్కమనగా నాలుగధ్యాయముల సముదాయము, మొదటి ద్వికమున శాస్త్రావిర్భా

తము, శాస్త్రావతరణమునకు కారణమైన శోకమును పోగొట్టునట్టి యాత్మసాక్షాత్కారమను రెండువిషయములను. చతుష్కమున ఆత్మ దర్శనసాధన వివరణములున్ను చెప్పబడినవి.

మధ్యమషట్కము : రెండు త్రికములుగా విభజించబడినది, త్రికమనగా మూడధ్యాయముల సముదాయము, మొదటిత్రికమున సాధనము, అధికారి, ఫలము మొదలగు భేదములుగల భక్తియోగ స్వరూపమున్ను, రెండవత్రికమున భక్తిపుట్టుటకున్ను, వృద్ధిపొందుట కును సాధనములున్ను తెలుపబడుచున్నవి.

తృతీయషట్కము : త్రికద్వయముగ విభజించబడినది, ఇందు మొదటి త్రికమున చిత్, అచిత్, ఈశ్వరులనెడు మూడుతత్త్వ ములను గూర్చి క్రమముగా మూడధ్యాయములచేతను తెలుపబడినది. మిగిలిన త్రికము కర్తవ్యవివేచనపరము.

ఈవిభాగమునుబట్టి పదమూడు పదునాలుగు పదునైదు అధ్యాయ ములు క్రమముగ చిత్ అచిత్ ఈశ్వరులనెడు మూడు తత్త్వములను గూర్చి విస్తారముగ బోధించుచున్నవి.

మఱియు సప్తమాధ్యాయారంభమున భగవంతుడు నాలుగు,ఐదు శ్లోకములలో అచేతనమును అపరప్రకృతియనియు, చేతనమును పర ప్రకృతియనియును చెప్పి ఈరెండు ప్రకృతులను 'మే. మే' యని నాయధీనమైనవ'ని చెప్పెను. దీనినిబట్టియును తత్త్వత్రయము సిద్ధించు చున్నది.

వదునాల్గవ అధ్యాయమున మూడవశ్లోకములో

శ్లో॥ మమ యోనిర్మహ ద్బ్రహ్మ।
తస్మి న్గర్భం దధా మ్యహమ్।
సమ్భవ స్సర్వభూతానాం।
తతో భవతి భారత॥

యోనిః మహత్ బ్రహ్మ మమ=సకలజగత్తునకును కారణమైన మూలప్రకృతి నాది=నాయధీనమైనది. దానియందు చేతన పుంజరూప మగు గర్భమును నేనే యుంచుచున్నాను. అనగా భోగమునకు సాధన మైన యచేతనప్రకృతితో భోక్తృవర్గపుంజమగు చేతన ప్రకృతిని కూర్చుచున్నాను. నా సంకల్పముచే నేర్పడిన నీసంయోగమువలన బ్రిహ్మాది స్తంభపర్యంత సకలభూతముల పుట్టుక జరుగుచున్నదని చెప్పబడెను. దీనినిబట్టి చేతనము అచేతనము ఈశ్వరుడువని మూడు తత్త్వములు వేఱువేఱుగనున్నట్లు ఋజువగుచున్నది. ఈయర్థమునే ఛాందోగ్యోపనిషత్ "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" యనెడు శ్రుతి వాక్యమువందలి 'సత్య' శబ్దముయొక్క నిర్వచనచేసి సమర్థించు చున్నది.

తస్య హావా ఏతస్య బ్రిహ్మణో నామ సత్యమితి తాని
హా వా ఏతాని త్రీణ్యక్షరాణి "సత్. తి. యం" ఇతి
తద్యత్స త్తదమృతం అథ య త్తి తన్మర్త్యం, అథ యద్యం
తేచోభే యచ్ఛతి యదనేనోభే యచ్ఛతి తస్మాత్ "యం"
అహా రహార్వా ఏవంవిత్ స్వర్గం లోకమేతి॥

ఛాం. 8-3-4.5.

అనగా బ్రహ్మకు సత్యమనిపేరు. అ శబ్దము సత్ + తి + యం అను మూడుపదముల సముదాయమగు సమస్తపదము. అందలి 'సత్' అనగా నశించనియాత్మ, 'తి' యనగా క్షణక్షణమున పరివర్తించు ప్రకృతి. 'యం' అనగా నీరెండింటిని జోడించు పరమాత్మ. ఇట్లెఱింగి యుపాసించువాడు ముక్తుడగును.

ఇదియేగాక పదమూడవ యధ్యాయమున పంతొమ్మిదవ శ్లోకమున

"ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావసి" అను పూర్వార్థము చిత్, అచిత్-ప్రకృతులను రెండింటిని అనాదులుగ చెప్పుచున్నది. వీటికంటె వేరగు ఈశ్వరతత్త్వ మనాదియనుటలో వివాదమే లేదుకదా! కావున మూడు తత్త్వములను నిత్యముగా ననాదినుండియు నున్నవని భగవద్గీతాసిద్ధాంతమున భగవద్రామానుజు లంగీకరించిరి.

ఇంకను నవమాధ్యాయమందలి పదియవ శ్లోకమున

"మయా ధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్।
హేతునానేన కౌన్తేయ । జగద్ధి పరివర్తతే."

అనగా నా యధీనముననున్న ప్రకృతి, సత్యసంకల్పుడనగు నేను జీవుల కర్మానుగుణముగ సంకల్పించుటచే చరాచరాత్మకమగు ప్రపంచమును సృష్టించుచున్నది.

దీనివలనను తత్త్వత్రయ యాథాత్మ్యము సిద్ధించుచున్నది. ఇట్లెన్నియో గీతాప్రమాణముల నవలంబించి భగవద్రామానుజులు పరమాత్మకధీనమైయుండు తత్త్వముల నగీంకరించిరి.

## 2. భగవద్రామానుజ సిద్ధాంతమున శ్రీమన్నారాయణుడే పరతత్త్వము

ఈ విషయమును భగవద్గీత యెట్లు సమర్థించుచున్నదో గాంచుడు. దీనిని గూర్చి పరమాచార్యులగు యమునాచార్యులవారు గీతచే ప్రతిపాదింపబడిన ప్రధాన తత్త్వము నీ క్రింది శ్లోకముతో స్పష్టపరచిరి.

శ్లో॥ స్వధర్మ జ్ఞానవైరాగ్య సాధ్య భక్త్యైక గోచరః ।
నారాయణః పరంబ్రహ్మ గీతాశాస్త్రే సమీరితః ॥

తనకు శాస్త్రముచే విధింపబడిన వర్ణాశ్రమధర్మములను లెస్సగానను ష్ఠించుటవలన వైరాగ్యము సిద్ధించును. దానిచే భక్తి వృద్ధిపొందును. అట్టిభక్తిమాత్రమే గోచరించు నారాయణుడే భగవద్గీతలో చెప్పబడుచున్నాడు.

గీత నుపదేశించు శ్రీకృష్ణుడు భగవంతుడనువిషయము నిర్వివాదము. కావుననే గీతలో నంతటను 'భగవానువాచ' యని వినబడుచున్నది. అట్టి భగవంతు డేడవయధ్యాయమున నేడవశ్లోకములో 'మత్తః పరతరం నాన్యత్ కించి దస్తి ధనంజయ'

అనగా అర్జునా! నాకంటె గొప్పదియగు తత్త్వమొక్కటియు లేదు సుమా!' యని సెలవిచ్చెను. ఆ యుపదేశము నాదరించి విశ్వసించిన యర్జునుడు ఏకాదశాధ్యాయమున నలుబదిమూడవ శ్లోకమున

"న త్వత్సమోఽ స్త్యభ్యధికః కుతోఽన్యో ।
లోకత్రయేఽప్యప్రతిమ ప్రభావ!

స్వామీ! ప్రపంచమునం దెచ్చటను నీతో సమానుడే లేడే, యిక నీకంటె గొప్పవాడెట్లుండునని స్తుతించెను.

పదినెనిమిదవ శ్లోకమున-

త్వమక్షరం పరమం వేదితవ్యం ।
త్వమస్య విశ్వస్య పరం నిదానం ॥
త్వ మవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా ।
సనాతన స్త్వం పురుషో మతో మే ॥

ఉపనిషత్తులలో తెలిసికొనదగినదిగా నిర్ణయింపబడిన అక్షరపదార్థము లన్నిటిలోను గొప్పవాడవనియు, ప్రపంచమునకంతకు నాధారభూతుడ వనియు మొదలుగాజెప్పి 'సనాతన స్త్వ' మ్మనుటచే నుపనిషత్తులలో 'వేదాహమేతం పురుషం మహాన్తం' 'పరాత్పరం పురుష ముపైతి దివ్య' మిత్యాదులతో చెప్పబడిన సనాతన పురుషుడవు నీ వేయని నా యభిప్రాయమని చెప్పుటచేతను,

అర్జునుడు దర్శించిన విశ్వరూపములో-

"బ్రహ్మాణ మీశం కమలాసనస్థం"

అనుటచే నందాధిపతియగు చతుర్ముఖ బ్రహ్మయు, ఆ బ్రహ్మయొక్క ఆజ్ఞానువర్తియైయుండు రుద్రుడును, విశ్వరూపుని శరీరైక దేశమున నిమిడి మెఱయుచుండునట్లు వర్ణించుటచేతను -

పదియవ యధ్యాయమున భగవంతుడే స్వయముగా-

"అహ మాదిర్హి దేవానాం (2 శ్లో)

అనగా బ్రహ్మరుద్రేంద్రాది దేవతలకందరకు నేనే కారణమైనవాడనని చెప్పుటచేతను.

ఎనిమిదవ శ్లోకమున -

"అహం సర్వస్య ప్రభవః"

అనగా విచిత్ర చిదచిత్ప్రపంచమునకు తానే కారణభూతుడనని చెప్పుటచేతను-

అర్జునుడు పదియవ యధ్యాయమున -

పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్య మాది దేవమజం విభుమ్॥

అనగా పరతత్వము నీవే యని భగవంతుని ప్రశంసించి 'దానికి సాక్ష్యముగా సకలఋషులను' దేవర్షియగు నారదుని, అసితుని, దేవలుని, వ్యాసుని జూపుటచేతను—శ్రీమన్నారాయణుడే పరతత్త్వమని నిర్ధారిత మగుచున్నది. దీనికి వ్యాఖ్యానమున భాష్యకారులు నారాయణానువాక ములో ప్రత్యేకించి చెప్పబడిన నారాయణపరత్వమునంతను నిచ్చట సమన్వయపఱచుటచే నారాయణుని పరత్వము సువ్యక్తమగుచున్నది.

మఱియు 'మామేకం శరణం వ్రజ' 'అహం త్వా సర్వ పాపేభ్యో మోక్ష యిష్యామి' అనుటచేతను నీ పరత్వము స్పష్టమగుచున్నది. ఈ శ్లోకార్థము వేఱొకచోట విపులముగ విమర్శింపబడును. గాని ప్రకృతమున 'నన్నే నీవుపాయమ్ముగ నమ్మియున్నచో నేను నీ యాగామి సంచిత ప్రారబ్ధ సకల కర్మ్మల విర్మూలింతునని యనుటకేదేవతకు సాహసముండును? అట్టిదాన్ని తానే స్వారతమార్థముగా నుడువుటచే పరమతత్త్వమని చాటబడుటలేదా?

కారణవస్తువే ధ్యేయమనియు అదియే మోక్షప్రదమనియు శ్రుతులు తెలుపుటచే పెక్కుస్థలములలో భగవానుడు తానే సమస్తమునకు కారణమనియు, తననే ధ్యానింపుమనియు తానే మోక్షము నిత్తుననియు శపథపూర్వకముగా సెలవిచ్చుటచే నారాయణుని పరతత్త్వము వెల్లడియగుచున్నది.

ఇట్లు గీతలో విద్ఘోషింపబడిన నారాయణ పరతత్త్వమునే రామానుజులు తమ దర్శనమున స్థిరీకరించిరి.

ఉపనిషత్తులోని తైత్తిరీయాంతర్గతమగు భృగువల్లిలో భృగువు తన తండ్రియగు వరుణుని పరంబ్రహ్మతత్త్వమును తెలుపుమని ప్రశ్నింపగా నాతడు –

"యతో వా ఇమాని భూతాని జాయన్తే
యేన జాతాని జీవన్తి
యత్ప్రయన్త్యభిసంవిశన్తి తద్బ్రహ్మ"

అని సెలవిచ్చెను. అనగా ఎవ్వనినుండి సమస్తభూతములను పుట్టుచున్నవో, ఎవ్వనిచే పోషింపబడుచున్నవో, ఎవ్వనియందు ప్రళయములో లీనమగుచున్నవో, మోక్షదశలో నెవ్వనియందు విశ్రమించుచున్నవో అనగా సృష్టిస్థితి సంహార మోక్షప్రదానములను జేయువాడే బ్రహ్మయని తెలిపెను. అట్టిపరబ్రహ్మయేగదా పరంతత్త్వము.

భగవానుడట్టి లక్షణోపేతుడు గనుకనే యర్జునుడు,

"పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్"

అని స్తుతించెను. భగవాను డీవిషయముల నెట్లు భగవద్గీతలో పదేపదే యుపదేశించెనో గాంచుదు.

"మమ యోని ర్మహ ద్బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహమ్"

[14 అ 3 శ్లో]

"సర్వ యోనిషు కౌన్తేయ మూర్తయః సమ్భవన్తి యాః
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజ ప్రదః పితా"

[14 అ 14 శ్లో]

దేవ, గన్ధర్వ. యక్ష, రాక్షస, మనుష్య. మృగ, పక్షి, సరీసృపాది జన్మలకు మూలప్రకృతి కారణము, ఆ ప్రకృతి వికారములగు శరీరములలో వారి కర్మానుగుణముగా చేతనవర్గములను కూర్చువాడను నేనే.

"అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా"

[17 అ 6 శ్లో]

పరావర ప్రకృతులు నా మూలకములేగాన నవి నావియే. వాటి వలన పుట్టినట్టి జగత్తునంతకును నేనే కారణభూతుడను, నేనే సంహారకుడను, నేనే శేషిని.

"పితాహ మస్య జగతః" [9 అ 17 శ్లో]

"ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృ తేర్వశాత్"
[9 అ 8 శ్లో]

నా యధీనమున నున్న ప్రకృతిని "భూమి రాపోఽనలో వాయు" రనునట్లెనిమిది విధములుగ పరిణమింపజేసి దేవతిర్యఙ్మ నుష్య స్థావ రాత్మకమగు నాలుగువిధములగు భూతజాతమును ప్రకృతికి పరతంత్ర ముగ నొనరించి ఆయా సమయములలో సృష్టించుచున్నాను.

ఎనిమిదవ యధ్యాయమున బ్రహ్మలోక పర్యంతమునుగల లోకములను, ఆలోకస్థులను, పరమపురుషుని సంకల్పముచే బుట్టుచును గిట్టుచును నుండు కాలవ్యవస్థను తెలుపు 'సహస్రయుగ పర్యన్త' మ్మని ప్రారంభించి 'ప్రభవత్యహరాగమే' యను 17, 18, 19 శ్లోకములలోని సారమును శ్రీ భాష్యకారులు—

'నా కంటె నితరమగు సమస్తమున్ను నాచే నిర్ణయింపబడిన ఆయాకాలములలో నానుండి బుట్టి నాయందే లయమగుచుండుటచే.... ఇత్యాది వాక్యములచే వ్యక్తపరచిరి.

విశ్వరూప సందర్శనాధ్యాయమున —

కాలోఽస్మి లోకక్షయ కృత్ప్రవృత్తః। లోకాన్ సమాహర్తు మిహప్రవృత్తః

(కల-సంఖ్యానే-లెక్కించుట) లోకుల జీవితావసానమును లెక్కించి సంహరించువాడను. అందులకే యిప్పుడుద్యోగించితినని చెప్పుటచే సంహారకర్త తానేయని స్పష్టపరచెను.

విశ్వరూపమున సర్వాధారత్వమును జూపెను.

తొమ్మిదవ యధ్యాయమున —

మాతా ధాతా పితామహః, అనియు -

15 వ అధ్యాయమున—

"గామావిశ్య చ భూతాని ధారయామ్యహ మోజసా" (13శ్లో)

అనగా-భూమిలో ప్రవేశించియుండి నా యప్రతిహత సామర్థ్యముచే సమస్త భూతములను ధరించుచున్నాననియు,

తొమ్మిదవ యధ్యాయమున —

"మయా తత మిదం సర్వం జగదవ్యక్త మూర్తినా"

"మత్థ్సాని సర్వభూతాని న చాహం తేష్వ వస్థితః" (4 శ్లో)

భూతభృన్న చ భూతస్థః మమాత్మా భూతభావనః (5శ్లో)

అనగా - చేతనా చేతనాత్మకమైన జగత్తునంతను పైకి కాన్పించకయే అంతర్యామిగానుండి ధరించుచు నియమించుచు శేషినై యుందును. నే నట్లుండుటచేతనే భూతములు నిలువగల్గుచున్నవి. నా స్థితికి వాటి

యుపకార మొంఉులేదు. నా సంకల్పముచేతనే యవియన్నియును సృష్టింపబడుచు ధరింపబడుచు నియమింపబడుచు నున్నవి.

సర్వ భూతాని కౌన్తేయ! ప్రకృతిం యాన్తి మామికామ్
కల్పక్షయే, పున స్తాని కల్పదౌ విసృజామ్యహామ్"

అనగా - స్థావర జంగమాత్మకమైన సమస్తభూతములునుచతుర్యుగావసానసమయమున నా సంకల్పముచేతనే నా ప్రకృతి యందు లయమగుచున్నవి. తిరిగి కల్పారంభమున నేనే నాసంకల్పముచే నన్నిటిని సృష్టించుచున్నాను. ఇత్యాదులచే సృష్టిస్థితిసంహార కర్త తానేయని నిస్సందేహముగా నుపదేశించెను.

"మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే"
[17 అ 14శ్లో]

నన్ను శరణుజొచ్చువారు సత్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతిని సర్వదా పీడుచున్నారనియును,

మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్॥
నాప్నువంతి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః॥"

అనగా-నన్నుపొందినవారు తిరిగి దుఃఖకరమగు నస్థిర సంసార వాగురమునబడరు. నన్నుపాసించువారు పరమపురుషార్థమగు నా సాయుజ్యమును పొందుదురు.

"ఆ బ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోఽర్జున
మా ముపేత్యు తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే"

బ్రహ్మలోకమువరకునున్న లోకములన్నియు భోగస్థానములు మాత్రమే. వారు వారా భోగముల ననుభవించుటకై గావించిన పుణ్యము క్షీణించ గనే తిరిగి సంసరింతురు. నన్ను పొందినవారికిక వినాశ ప్రసంగమే లేదుగాన వారికి పునర్జన్మ లేదు.

తొమ్మిదవ యధ్యాయమున-

"యత్కరోషి యదశ్నాసి...తత్కురుష్వ మదర్పణమ్
శుభాశుభ ఫలైరేవం మోక్ష్యసే కర్మబన్ధనైః
సన్న్యాసయోగ యుక్తాత్మా విముక్తో మాముపైష్యసి

[27, 28 శ్లో]

నీవు చేయునట్టి లౌకిక వైదిక కర్మల నన్నిటికిని కర్తను భోక్తను ఆరాధ్యుడను నేనే యని నమ్మకముతో చేయుము.

ఇట్లు నీవు నాకు శేషభూతుడవుగాన నీ ప్రవృత్తి నివృత్తు లన్నియును నా యధీనమే. కావున నీవుచేయు కర్మలన్నియును నా యారాధన రూపములే యగుచున్నవి. ఇట్లెఱింగి యిట్టి యధ్యవసాయ ముతో చేసినచో నన్ను పొందుటకు విరోధులగు సకల బంధముల నుండియు విముక్తుడవగుదువనియు,

తొమ్మిదవ యధ్యాయమున అంతమునందును (34వ శ్లోకము నను) పదునెనిమిదవ యధ్యాయమున 65వ శ్లోకమునను కొద్ది పాఠ భేదముతో -

'మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు'
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః'
(9 అ 34 శ్లో)

మన్మనా భవ మద్భక్తో............
............సత్యంతే ప్రతిజానే ప్రియోఽసి మే.
(18 అ 65 శ్లో)

అను నీ రెండు శ్లోకముల చేతను సాంగోపాంగమగు తన యుపాసన మువలన తన సాయుజ్యమును బడయగలుగుదురని సెలవిచ్చెను.

గీత 18వ అధ్యాయములోని 66వ శ్లోకమున -

సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ।
అహంత్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మా శుచః॥

అనగా - ఇతర మోక్షోపాయముల నన్నిటిని విడచి నన్నే మోక్షోపాయ మని నమ్మియుండినవారిని నన్ను పొందుట కాటంకములుగా నుండు సకల పాపములనుండియు విడిపించి మోక్షమును బడయజేతుననియును సెలవిచ్చియుండుటచే మోక్షసాధనమున్ను నాతడేయని తెలియుటచే నిట్లు బ్రహ్మలక్షణములన్నియును సమగ్రముగ నాతనియందే సమన్వయ మగుచుండుటచే నాతడే పరతత్త్వమగుట విశ్వవ్రిచము.

3. భగవంతుడు సర్వాత్మకుడు, చేతనాచేతనము లన్నియునన్ని యవస్థలలోను నాతనికి శరీరభూతములు -

భగవంతుడు సర్వాత్మకుడనియును, చేతనా చేతనములన్నియు నాతనికి శరీరభూతములనియు, రామానుజులు తమ శ్రీభాష్యాది గ్రంథములలో బేర్కొనిరి.

శ్రీభాష్య ద్వితీయాధ్యాయ ప్రథమపాదమున 'విలక్షణత్వాధి కరణములో 'అపీతౌ తద్వ త్ప్రసఙ్గాదసమఞ్జస' మ్మను సూత్రమున (2-1-8) జగద్బ్రహ్మలకు శరీర శరీరిభావము సంగతము కాదని పూర్వపక్ష ముదయింపగా - "నతు దృష్టాన్తా భావా" త్తను సూత్రి వ్యాఖ్యానమున నిర్దుష్ట శరీరలక్షణమును వెలవిచ్చి యా యాక్షేపణల నన్నిటిని పరిహరించిరి.

ఆ లక్షణము

యస్య చేతనస్య యద్ద్రవ్యం సర్వాత్మనా స్వార్థే నియన్తుం ధారయితుం చ శక్యం, తచ్ఛేషతైక స్వరూపం త త్తస్య శరీర మ్మను నదియే.

దీని యర్థమేమనగా-

ఏ ద్రవ్య మే జీవున కన్నివిధముల తన ప్రయోజనమునకే విని యోగింపదగియుండునో, తన చేతనే ధరింపదగియుండునో, సర్వా త్మనా తన యతిశయమునకే యుపయోగింపదగి యుండునో, ఆ ద్రవ్య మాచేతనునకు శరీర మనబడును. ఆ చేతనుడు శరీరి యనబడును.

ఈ పైకి గాన్పించు పాంచభౌతిక శరీరము తనలోనుండు జీవుని ప్రయోజనమునకే వినియోగపడుచున్నది. ఆ జీవునిచేతనే ధరింపబడు

చున్నది. సర్వాత్మనా ఆ జీవునకే యతిశయావహ మగుచున్నది. కావున నిది - లోనున్న జీవునకు శరీర మనబడును. ఆ చేతనుడు శరీరి యన బడుచున్నాడు.

ఇట్లే చేతనాచేత నాత్మకమైన ప్రపంచమంతయును శ్రియఃపతికి మూడు ప్రయోజనములకును వినియోగపడుచున్నది. గాన నిది శ్రియః పతికి శరీర మనబడుచున్నది. శరీరమును తెలుపు శబ్దము లన్నియును శరీరిని తెలుపునుగాన చేతనాచేతన వాచకములగు శబ్దము లన్నియును శరీరియగు పరమాత్మకు వాచకములగును. ఇది శాస్త్ర మర్యాద.

ఇట్లు పరమాత్మకు సర్వాత్మకత్వమున్ను దానిచే చేతనా చేతన శరీరకత్వమున్ను భగవద్గీతలో నెట్లు చెప్పబడుచున్నదో చూతము.

"అహ మాత్మా గుడాకేశ! సర్వభూతాశయ స్థితః॥

[10 వ అ. 20 శ్లో]

నాకు శరీరములగు సమస్త భూతములయొక్క హృదయమున నేనా త్మగా నుందును. ఆత్మయనగా శరీరమునకు సర్వాత్మనా ఆధారముగా నుండి నియమించు శేషి యని యర్థము.

"సర్వస్య చాహం హృది సన్నివిష్టో।
మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనం చ॥

(15 వ అ. 15 శ్లో)

సమస్త భూతజాతముయొక్క హృదయమున నాత్మగానుండి నా సంకల్పముచే సర్వమును నియమించుచుందును.

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి"
(18 వ అ. 61 శ్లో)

సర్వనియమనశీలుడగు వాసుదేవుడు సకలభూతములయొక్క సకల ప్రవృత్తి నివృత్తులకును మూలమగు జ్ఞానము పుట్టుచోటగు హృదయమున నుండును.

(ఇది ప్రాణముగల భూతముల కంతర్యామిత్వము)

ఇక నచేతనములకును భగవంతు డంతర్యామి యనుటకు

"న తదస్తి వినా యత్స్యాత్ మయా భూతం చరాచరమ్"
(10 వ అ. 39 శ్లో)

చరాచరాత్మక పదార్థములలో నే నాత్మగాలేని పదార్థ మొక్కటియును లేదు.

పదియవ యధ్యాయములో సమస్త చేతనాచేతనములలో నే నంతర్యామిగా నుండుటచేత నే నవియన్నియును నేనే యను సామానాధికరణ్యము సమన్వయమగుచున్నది. ఈ యధ్యాయ ప్రారంభమున నవతారికలో భాష్యకారులు జగత్తంతయు భగవంతునకు శరీరమగుటచే భగవదాత్మకమనియు దానిచే భగవంతునిచే ప్రవర్తింపజేయబడుచున్నదనియు చెప్పియుండిరి.

ఏడవ యధ్యాయమునందలి ఎనిమిదవ శ్లోకమున కవతారికలో భాష్యకారులు 'సమస్త చేతనాచేతనములను పరమాత్మకు శరీరభూత

ములుగాన పరమపురుషు డన్నిటికిని యాత్మయై యున్నాడు. అందు వలన సకలశబ్దములాతనినే యపర్యవసాన వృత్తితో బోధించు చున్నవి. ఆ విషయమును సామానాధికరణ్య నిర్దేశముతో పరమాత్మ ఈ ముందు శ్లోకములలో తెలవిచ్చుచున్నాడు.

"రసోఽహమప్సు కౌన్తేయ ప్రభాస్మి శశి సూర్యయోః" అని మొదలుపెట్టి "ధర్మా విరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ" అను 9, 10, 11 శ్లోకములలో వివరించెను.

ఈశ్లోకములకు భాష్యమున "ఈవిలక్షణ పదార్థములన్నియు నా నుండియే పుట్టినవి. నాకు శేషభూతమైనవి (నాకు యథేష్టవినియోగార్హములు) కావున నాకు శరీరభూతములై నాయందే యున్నవి. ఈకారణమున తద్వాచక శబ్దములచే నేనే తెలుపబడుచున్నాను - అని సాయించెను.

ఇట్లు చేతనాచేతనము లన్నిటిలోను పరమాత్మ అంతర్యామిగా నాత్మభూతుడై యున్నాడనియు, అవియన్నియు పరమాత్మకు శరీర భూతములనియు నిర్ధారింపబడియున్నది.

## 4,5, భగవంతుడు సకల కల్యాణ గుణాకరుడు

భగవద్గీతలో భగవంతుడు తాను సృష్టిస్థితిలయకర్త ననియు సర్వరక్షకుడనవియు తెలవిచ్చెనవి తెలిపియుంటినికదా! ఇట్టి కార్యములకు సర్వజ్ఞత్వ, స్వరశక్తిత్వ, సత్యసంకల్పత్వ, వాత్సల్యాది కల్యాణ

గుణము లుండవలెను. శాస్త్రజ్ఞులు "ఉపాదానగోచరా పరోక్షజ్ఞాన చికీర్షాకృతిమత్త్వం కర్తృత్వ" మ్మని కర్తృత్వమునకు లక్షణ మును చెప్పిరి. అనగా సకల కార్యములకు నుపాదానమగు పదార్థ సాక్షాత్కారమున్ను, ఆ కార్యములను చేయవలెననెడి సంకల్పమున్ను, ఆపైన తద్విషయక కృతియున్ను కలవాడే కర్త కావలెను. ఇందులకై సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వ సత్యసంకల్పత్వములు కావలెను.

"సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవా ద్వితీయం" "ఆత్మావా ఇదమగ్ర ఆసీత్, న బ్రహ్మేనే శానః" ఇత్యాది ప్రమాణములచే సృష్టికి పూర్వము పరమాత్మ యొక్కదేతప్ప తదితరసాధనము లేవి యును లేవని తెలియుచున్నది. అట్టితరి యింతటి సృష్టి నెట్లు చేయ గలిగెను? దానికి సత్యసంకల్ప మొక్కటియే సాధనము! రక్షణమ నగా అనిష్టములను పోగొట్టి యిష్టములను ప్రసాదించుట. ఈ యిష్టా నిష్టములు భిన్నములుగా నుండును. వాటినన్నిటిని తెలిసికొని యనిష్టములను పోగొట్టి, యిష్టములనీయవలెనన్న సర్వజ్ఞత్వ సర్వ శక్తిత్వ వాత్సల్యాదు లుండవలెనుకదా! మఱియును "ప్రియో హి జ్ఞా నినోఽత్యర్థ మహం న చ మమ ప్రియః" అనుచో తనను ప్రేమించు భక్తునకు తనయెందెంత ప్రేమ కలదో దానిని 'అత్యర్థ' మ్మని పెలవి చ్చెను. 'అత్యర్థ' మనగా 'అర్థోఽభిధేయ రై వస్తు ప్రయోజన నివృత్తి షు' అనుకోశానుసారము 'అతిక్రాన్తాభిధేయ' మని యర్థము. అనగా నా భక్తునకు నాయందుగల ప్రేమను సర్వజ్ఞుడను సర్వశక్తియుతుడను నగు నేనే చెప్పచాలనని యర్థము. 'న చ మమ ప్రియః' అతడును నా

కంతయే ప్రియుడని సెలవిచ్చెను. ఈప్రీతి యొక కల్యాణగుణముకదా!

మఱియును—

"చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోఽర్జున,

అని సెలవిచ్చిన తనభక్తుల విషయమై తన యాదరమును తెలుపుచు—

"ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మత" మ్మనెను. అనగా తననుండి పురుషార్థములను ప్రార్థించి బడయువారు ఉదారులని సెలవిచ్చెను. తీసికొనువారు దారులెట్లగుదురనగా వ్యాఖ్యానకారులు "మత్తో యత్కించన గృహ్ణన్తి తే హి మమ సర్వస్వదాయినః! ఆశ్రిత సకల ఫలప్రదత్వం మమసర్వస్వ' మ్మని వాఖ్యానించిరి. అనగా నా నుండి యే పురుషార్థమునర్థించి గొనినను వారు నాకు సర్వస్వము నిచ్చువారనియే నేను భావింతును. ఆశ్రితులు కోరిన ఫలము నొసంగుటయే నా సర్వస్వము అని సెలవిచ్చెను. ఈసూక్తిలో భగవంతుని యౌదార్యమెంత యుట్టిపడుచున్నదో చూడుడు. ఇది కల్యాణగుణము కాదా! "జ్ఞానీ త్వాత్మైవ మే మత" మ్మని భక్తుడు తనకాత్మయే యనెను. నీకొకయాత్మయున్నట్లు పనిషత్తులలో లేదేయనగా "అయ మౌపనిషద సిద్ధాన్తో ఽ స్తువా మావా శ్రీకృష్ణ సిద్ధాంత ఇతి ఘుష్యతా" మని 'మేమత' మ్మను సూక్తిచే తెలియబఱచెను. అనగా ఉపనిషత్తులలో లేకున్న నాకు లోటులేదు. ఇదియొక అపూర్వమగు శ్రీకృష్ణ సిద్ధాంతమని యాతని యభిప్రాయము. ఇదియే కదా యౌదార్యమునకు పరాకాష్ఠ. ఇదియొక కల్యాణగుణముకాదా?

తొమ్మిదవ యధ్యాయమున ఇరువదియారవ శ్లోకమున "పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి। తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః" నా భక్తులు నాకు భక్తితో సమర్పించిన ఆకునో, పువ్వునో, పండునో, నీటినో నేనా భక్తినే ప్రధానముగా గ్రహించి భుజింతునని సెలవిచ్చెను. ఈ శ్లోకమందలి ప్రయతాత్మనః అనుపదము సమర్పించు వాని యోగ్యతను తెలుపుచున్నది. (తత్ప్రదానైకప్రయోజనరూప పరిశుద్ధయుక్త మనసః - అనగా ఆ పత్ర పుష్పఫలాదుల నొసంగుటలో ప్రయోజనాంతరముల నపేక్షింపక సమర్పించుటయే ప్రధాన ప్రయోజనముగ సమర్పించుట)

అట్లిచ్చినదానిని 'అశ్నామి' యనుట యెక ముఖ్య విశేషము. దీనికి భాష్యకారులు-

"అహం సర్వేశ్వరో నిఖిలజగదుదయ విభవ లయలీలోఽవాప్త సమస్తకామ స్సత్య సఙ్కల్పోఽనవధికాతిశయా సఙ్ఖ్యేయ కల్యాణగుణ స్స్వాభావికా నవధికాతిశయా నన్ద స్స్వానుభవే వర్తమానోఽపి మనోరథ పథదూరవర్తి ప్రియం ప్రాప్యే వాశ్నామి"

ఈ పత్రాది క్షుద్రద్రవ్యములను పరిగ్రహించుటకు విరుద్ధములగు ప్రకారములన్నియు నిచ్చటి విశేషణములచే తెలుపబడుచున్నవి.

సర్వేశ్వరః = ఇంద్రాదులు తమశక్తిని వృద్ధిపరచుకొనుటకై హవిరాదులను పరిగ్రహింతురు. నేనే సర్వేశ్వరుడను. అన్నిటిని ననాదికాలమునుండియు నియమించుశక్తిమంతుడను, వారిచ్చు దానివలననాకు లభించు నతిశయ మేమియును లేదు.

నిఖిల జగదుదయ విభవ లయ లీలః = నా లీలోపకరణములలో చేరని పత్రాదుల నిచ్చుటలేదే! వాటిని నా లీలోపకరణములుగా నేనే సృష్టించుకొంటిని.

అవాప్త సమస్త కామః = నాకు లేనిదాని నిచ్చుచున్నాడా? నాకు లేనిదే లేదే?

సత్య సఙ్కల్పః= - నేను సంపాదించుకొనలేనిదాని నిచ్చుచున్నాడా? నేను నా సంకల్పముచే నన్నిటిని సృష్టించుకొనగలనే! అశ్నామి - నీటిని కూడ తిందువా? యని ప్రశ్నింపగా ఇచ్చువాడు తెలివితో సమర్పించిన, నేనును తెలివితో తినదగువాటిని తినియు, త్రాగదగినవానిని త్రాగియు నుపయోగించుకొందును. అతడు తన యొడలెఱుంగని భక్తితో సమర్పించునుగాన నట్టిపదార్థములను నేనును నొడలెఱుంగక తినవలసిన వానిని త్రాగుదును. త్రాగవలసిన వానిని తిందునను భావమునే సూచించెను. ఇదియేకదా స్వారాధ్యత్వము. ఇది యొక కల్యాణగుణము కాదా!

ఈ యధ్యాయమున ముప్పదియవ శ్లోకమున
"అపి చేత్సు దురాచారో భజతే మా మనన్య భాక్।
సాధురేవ సమన్తవ్యః సమ్యగ్వ్యవసితో హి సః"

అనగా ఆయావర్ణములకును, ఆశ్రమములకును నేను విధించిన ధర్మములను విడచి, కూడదని చెప్పిన ధర్మముల నాచరించు దుర్మార్గుడైనను నన్ను భజించుటయే ప్రయోజనముగా భజించుచో వాడు

వైష్ణవాగ్రేసరుడేయని నేను సంభావింతునని సెలవిచ్చెను. ఇది వాత్స ల్యగుణముకాదా!

నాలుగవ యధ్యాయమున పదకొండవ శ్లోకములో.

"యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్"

అనగా దేవమనుష్యాది రూపములతోనవతరించి నన్నాశ్రయించగోరువా రినిమాత్రమే రక్షించుటగాక నన్నాశ్రయింపగోరి భమకిష్టమగు నే ఆకారముతో నన్నాశ్రయించుచున్నారో వారిని నేనారూపముతో భజించు చున్నానని యానతిచ్చెను. మనమాతని భజించుట సమంజసమేగాని యాతడు మనలను భజించుట సమంజసమా? అతనికి భక్తులయెడ్లగల యాదరమున్ను సమత్వమును గోరక్షణ. ఇదియునొక శిలాఘ్యగుణము.

తొమ్మిదవ యధ్యాయమున విరువది తొమ్మిదవ శ్లోకమున.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్"

పత్రం పుష్పం ఫలం తోయం మన్న శ్లోకమునలో భక్తులు సమ ర్పించు ద్రవ్య తారతమ్యమును పాటించనని చెప్పుటచే సౌలభ్యగుణ మున్ను, ఈ శ్లోకమున తన యతిలోకి స్వభావమును సెలవిచ్చుచున్నా డని భాష్యకారు లవతరింప జేసిరి. భక్తులతో తనకుగల యైకరస్య మున్ను తెలుపుచున్నారని భావము. దీనినే సౌశీల్యమందురు.

'మహతో మందైస్సహ నీరంధ్రేణ సంశ్లేష స్సౌశీల్య' మ్మని దాని లక్షణము. ఈశ్లోకమునకు భాష్యమున 'దేవ తిర్యఙ్మ నుష్య

స్థావరాత్మకముగ నున్న ప్రాణులలో జాతిని బట్టియు, ఆకారమును బట్టియు, స్వభావమును బట్టియు, జ్ఞానమును బట్టియు హెచ్చు తగ్గులుగ నున్నవారిలో నన్నాశ్రయించుటకు తారతమ్యమును పాటించను. నాయందత్యంత ప్రేమతో నన్ను భజించక జీవించలేని యార్తితో భజించుటయే ప్రయోజనముగ నన్ను భరించువారు జాతిచే గొప్పవారు కాని నీచులుగాని నాతో సమానులవలెనే నాతో వ్యవహరింతురు. నేను వారివల్ల నాకంటె గొప్పవారి విషయములలో నెట్లు సంచరింతునో యట్లు సంచరింతును. ఇట్లు తాను గొప్పవాడై యుండియు తనకంటె తక్కువవారితో నరమరికలేక యిట్లు కలిసి మెలసి యుండుటయే కదా సౌశీల్యము.

పదునారవ యధ్యాయమున దైవాసుర సంపత్తిని వ్యక్తపరచుచు నాయా స్వభావములను పేర్కొని యాపైన.

"దైవీసంప ద్విమోక్షాయ నిబంధాయాసురీమతా"

[16 అ. 5 శ్లో]

అనుచు దైవసంపన్నులు ముక్తులగుదురనియు, అసురసంపన్నులు బద్ధులగుదురనియు చెప్పగా విని యర్జునుడు తానాసురసంపత్తునకు జెందినవాడనోయని భయపడి దుఃఖింపగా జూచి -

"మాశుచః సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ"

అనగా 'అర్జునా, నీ వేల దుఃఖింతువు? నీవు దైవసంపత్తుకు చెందినవాడ' వని యోదార్చుటయును, పదునేనిమిదవ యధ్యాయమున -

"ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరమ్మయా
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు"

[18 అ. 63శ్లో]

అనగా! అర్జునా, నీకింతవరకిట్లు గుహ్యతర విషయము నుపదే శించితిని. దీనిని బాగుగా సమగ్రముగా విమర్శించు కొని నీకు తోచి నట్లు చేయుమని యుపదేశింపగా నర్జునుడు 'ఇంతవరకు నేనువినిన దంతయును గుహ్యతరమేనా? ఇంకను గుహ్యతమమును వినుట శేషిం చియున్నదో? కార్పణ్యదోషోపహతుడనై కింకర్తవ్యతా విమూఢు డగు నేనిప్పుడు దీనినంతను విమర్శింపగలనా? అపైన నాయిష్టము వచ్చినట్లు చేయవలెనా? ఇది నా తరమా? యని దుఃఖింప దొడంగెను. ఆ యవస్థనుగని భగవంతుడు దయామయుడగుటచే-

"సర్వ గుహ్యతమం భూయః శ్రుణుమే పరమం వచః

ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్మని"

వగచి నాకు మిక్కిలి యిష్టుడవుగాన నీకిప్పుడు గుహ్యతమోపదేశ మును చెప్పివేయుచున్నాను. శ్రద్ధగా వినుమని మొదలిడి-

"సర్వ ధర్మాన్ పరిత్యజ్యే" త్యాది గుహ్యతమోపదేశమును గావించి మాశుచః" యనియోదార్చెను.

ఇది పరదుఃఖా సహిష్ణుత్వ రూపమగు కృపాగుణము కాదా!

"అహంత్వా సర్వ పాపేభ్యో. మోక్షయిష్యామి మా శుచః"

అనగా నేను నిన్ను సకలపాపములనుండి విడిపింతును. దుఃఖింపకుము అనెను. ఇచ్చట సకలపాపము లనుటలో సర్వపదమునకు సంకోచ నిమిత్తము లేదుకావున ఆగామి సంచిత ప్రారబ్ధములనియెడు త్రివిధ ములగు పాపములనుండి యని యర్థము. శాస్త్రము లన్నిటిలోను 'ప్రారబ్ధం పరిభుజ్య ప్రారబ్ధ మనుభవించియే తీరవలెననియు-

"భోగేన త్వితరే క్షపయిత్వాథ సంపత్స్యే" అనుసూత్రమును ప్రారబ్ధ పుణ్యపాపముల ననుభవించియే తీరవలెననియు. "ఆచార్యవాన్ పురుషో వేద తస్యతావదేవ చిరం యావన్నవిమోక్షే' అను నుపని షత్తులో నుపాసకునకును, మోక్షములభించుటలో ప్రారబ్ధ కర్మానుభవమే విలంబము, అదికాగానే ముక్తుడగుననియు ప్రారబ్ధమునకింత ప్రాబ ల్యముండగా నన్నుపాయముగా నీ వద్యవసింతువేని యాప్రారబ్ధము నుండియు నిన్నునేను విడిపింతునమటలో తననిరంకుశ స్వాతంత్ర్యము వ్యక్తమగుచున్నది.

ఆ యధ్యాయముననే -

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా,"
(18 అ శ్లో)

అనగా సర్వనియమనశీలుడగు సర్వేశ్వరుడు సకలభూతముల యొక్క ప్రవృత్తి నివృత్తి జ్ఞానములకు పుట్టినిల్లగు హృదయప్రదేశ మునందుండి తనచేతనే దేహేంద్రియములుగ పరిణమింపజేయ బడిన

ప్రకృతి నధిష్ఠింపజేసి కర్మానుగుణముగ ప్రవర్తింప జేయుచుండు ననుటచే తన సర్వనియంతృత్వము స్ఫుటమగుచున్నదిగదా!

పదునారవ యధ్యాయమున -

"తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్ర మశుభాన్ ఆసురీష్వేవ యోనిషు."

అనగా అసురప్రకృతికి జెందినవారై నన్ను ద్వేషించు నరాధములను నిరంతరము పంది, కుక్క, రాయి, రప్ప మొదలగు జన్మలయందే పడద్రొక్కుచుండుననుటచే నాతని నిరంకుశ స్వాతంత్ర్యము స్ఫుటము కదా!

'మత్కర్మ కృన్మత్పరమః. యత్కరోషి తత్కురుష్వ మదర్పణమ్' 'మన్మనాభవ మద్భక్తో మద్యాజీ' 'మామేవ యే ప్రపద్యన్తే. ఇత్యాదులచే తన నాశ్రయింపుమనియు, తన సేవ చేయుమనియు సర్వము తనకర్పింపుమనియు, తననే ధ్యానింపుమనియు, తనకు శరణాగతినే చేయమనియు నుపదేశించుటచేతను ఆశ్రయణ సౌకర్యాపాదక కల్యాణగుణములున్ను, పరత్వప్రకాశమగు సర్వజ్ఞత్వసర్వ శక్తిత్వాదులచే ఆశ్రిత కార్యసాధక కల్యాణగుణములున్ను పుష్కలముగ నున్నవని సువ్యక్తమగుచున్నది.

ఇట్లు కల్యాణగుణము లసంఖ్యేయములుగ తనయందుండుట చేతనే -

"మత్తః పరతరం నాన్యత్కించి దస్తి ధనఞ్జయ,"

అనగా జ్ఞాన శక్తి బలాది కల్యాణగుణములు కలిగియుండుటలో నేనేగొప్పవాడను. ఇట్టి కల్యాణగుణములు కలిగియున్నది నాకంటె వేరైన నొక్కటి లేనేలేదని సెలవిచ్చెను.

## 6 భగవ దర్చారాధనము నిత్యమును కర్తవ్యము

ఇది శ్రీరామానుజ దర్శనముకొక ముఖ్య సర్వసాధారణ కర్తవ్యాంశము. పంచసంస్కార సంపన్నుడైన గాని వైష్ణవుడు కానేరడు. పంచసంస్కారములనగా -

తాపః పుండ్ర స్తథానామయాగో మన్త్రశ్చ పఞ్చమః
అమీ తు పఞ్చసంస్కారాః పరమై కాన్తి హేతవః

ప్రపన్నుడు కాగోరువాడు సదాచార్యసమాశ్రయణమును చేసి తప్తశంఖచక్రములను భుజములపై ధరించుట, ఊర్ధ్వపుండ్రమును ధరించుట, దాస్యనామము నుంచుకొనుట, నిత్యమును భగవదారాధనను గావించుట, మన్త్రోపదేశమునుబడసి నిరంతరము శ్రద్ధతో సార్థముగా ననుసంధించుటయును చేయవలెను. ఇందు భగవదారాధనము ప్రధానాఙ్గము. దీనిని భగవానుడు భగవద్గీతలోని నాల్గవ యధ్యాయములో పదకొండవ శ్లోకమున -

"యే యథామాంప్రపద్య న్తే తాంస్తథైవ భజామ్యహమ్॥"

అనగా ఎవరు నన్నారాధింపగోరి తమకభిమతమగు నేరూపముతో నన్ను భావించి యాశ్రయింతురో నేనా రూపముతోనే వారికి నాదర్శన మిచ్చుచున్నానని సెలవిచ్చెను.

శ్రీభాష్యకారుల హృదయమును నిస్సంశయముగా నెఱుంగ గలిగిన శ్రీవేదాంతదేశిక శిఖామణులీ భాష్యమునకు -

“ఏవం సాధు పరిత్రాణార్థం దేవమనుష్యాది సజాతీయ స్వేచ్ఛావతార వర్ణన ముఖేన ఉపాసనోపయుక్తం స్వసౌలభ్య ముక్తం. అథ తస్యైవ కాష్ఠాప్రాప్తాం దశాం దర్శయతి తయే యథేతిశ్లోకేన, అత్ర కృష్ణావతార వృత్తాంతేన సహ అర్చావతార వృత్తాన్తోఽభిహితః” అని సాయించిరి.

అనగా సజ్జన రక్షణ దుర్జన శిక్షణ ధర్మసంస్థాపన ప్రయోజనములను సాధించుటకై తాను దేవమనుష్యాది రూపములనో స్వేచ్ఛగా నవతరించుటను చెప్పుచున్న ప్రసంగములలో నుపాసకున కుపకరించు సౌలభ్యము చెప్పబడినది. ఇప్పుడీ శ్లోకమున ఆసౌలభ్యమునకు చివర హద్దుగానుండు దశను చూపుచున్నారు. ఇచ్చట కృష్ణావతార ప్రసంగములో నర్చావతార వృత్తాంతము కూడ తెలుపబడినది -

12 వ అధ్యాయమున 8వ శ్లోకమునారంభించి మోక్షోపాయము నుపదేశించుచు నన్ను గూర్చిన ఉపాసన నిరతిశయ పురుషార్థము నొసంగునదియును సులభమైనదియును కావునశ్రమ ఫలప్రదమునుగాన నన్నే పరమప్రాప్యమని నమ్మి నన్ను ధ్యానింపుము. అందుకు శక్తిలేనిచో దుర్గుణదూరుడను, సద్గుణాకరుడనునగు నన్నే నిరతిశయప్రేమతో ధ్యానించుట కలవరచుకొనుము. అందులకును నీ కవకాశమును శక్తియును లేనిచో -

"మత్కర్మపరమోభవ" (12 అ: 10 శ్లో.) అని యుపదేశించెను. నాకర్మలనగా - నాకొఱకై ఆలయములు నిర్మించుట, తోట నాటుట, దీపముల వెలిగించుట, నామందిరముల నూడ్చుట, నీరు జల్లుట, అలుకుట, ముగ్గులు పెట్టుట. పుష్పములను తెచ్చి యిచ్చుట, పూజలుచేయుట, నామసంకీర్తనమును గావించుట, ప్రదక్షిణములు నొనరించుట, స్తోత్రములను ననుసంధించుట మొదలగునవి. వీనిని నాప్రీతి కొఱకై మిక్కిలి ప్రీతితో జేయమని విధించెను. ఇది యర్చా విగ్రహారాధనోపదేశమే గదా!

తొమ్మిదవ యధ్యాయమున-

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు"

అని భక్తిస్వరూపదేశపరమగు 34వ శ్లోకమున మద్భక్తః మద్యాజీ యను పదములకు భాష్యకారులు -

'అనవధి కాతిశయ ప్రియ మదనుభవకారిత మద్యజనపరో భవ? యజనం నామ - పరిపూర్ణ శేషవృత్తిః,

ఔపచారిక. సాంస్పర్శిక, ఆభ్యవహారిక, సాందృష్టిక సకల భోగప్రధాన రూపోహి యాగః' అనగా నేననంత కల్యాణగుణాకరుడను, దృష్టిచిత్తాపహారి సౌందర్యసీమా భూమియు నగుటచే నాయను భవ మపారప్రీతి నొసంగును. ఆ ప్రీతిచే ప్రేరితుడవై నా పూజను గావింపక నిలవలేక పోయెదవు. నా పూజయనగా ఔపచారికాది చతుర్విధోపచారములను నిరతిశయప్రీతితో చేయక యుండలేని యార్తితో చేయుట-అని సాయించిరి.

ఔపచారికము లనగా - నీరాజనాదులు,

అభ్యవహారికములనగా - భోగరాగాదులు,

సాందృష్టికములనగా - దీపాదులు,

సాంస్పర్శకములనగా - స్రక్చందనాదులు,

వీనిని సమర్పించుటయే భగవత్పూజన మనబడును. ఇవి యన్నియు సర్వాభ్యర్తికి చేయు నుపచారములేకదా!

ఇచ్చటనొక ముఖ్యవిషయమును గుర్తింపవలెను.

భగవద్గీతోపదేశము భాష్యకారులు సాయించినట్లు- "పాణ్డు తనయయుద్ధ ప్రోత్సాహన వ్యాజేన 'మోక్షసాధనతయా స్వవిషయం భక్తియోగ మవ తారయామాస"

అనుటచే నిది యర్జునుని వ్యాజముగా కల్పించుకొని సకల మానవుల నుద్ధరించుటకే యుపదేశించిన గ్రంథమని విశ్వసింపవలెను. కేవల మర్జునుని కొఱకే యైనచో నవియును యుద్ధ ప్రోత్సాహమున కే యైనచో నింత చెప్పనవసరము లేదు. ఒక విశ్వరూప సందర్శనము మాత్రమే యర్జునుని యుద్ధమునకు ప్రోత్సహించుటకు సుపర్యాప్తము. అట్లు మనకొఱకే యీయుపదేశమైనచో-

"పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి"

"యత్కరోషి... తత్కురుష్వ మదర్పణమ్"

అను నుపదేశమెట్లు ఘటించును? ఇప్పుడు వీటిని సమర్పించుటకా కృష్ణుడేడి? ఇక వివి యర్పించుట యర్చామూర్తికే యనవలెను గదా!

దీనిని బట్టి యర్చారాధన భగవద్గీతలో భగవానునిచే నాదరముతో నుపదే శింపబడినదనెడు నభియుక్తోక్తియే సమంజసము. దీనికే భగవద్రామానుజాలు తమ సిద్ధాంతమున ప్రాధాన్యము నొసంగిరి.

మరియొక ముఖ్యవిషయము-4వ అధ్యాయమున యజ్ఞములను విభజించుచు

"దైవ మే వా ప రే యజ్ఞం యోగినః పర్యుపాసతే"
(4 అ. 25వ శ్లో)

అను శ్లోకమునకు భాష్యములో భాష్యకారులు-

దైవం = దేవతార్చనరూపక యజ్ఞమ్, అపరే, కర్మయోగినః, పర్యుపాసతే = సేవన్తే = తత్రైవ నిష్ఠాం కుర్వన్తీత్యర్థః' అని సాయించిరి. అనగా కొందరు కర్మయోగు లర్చారాధనయందే నిష్ఠకల వారై, దానినే యజ్ఞముగా నాచరింతురని సెలవిచ్చిరి.

మరియు 28వ శ్లోకమున -

"ద్రవ్య యజ్ఞా స్తపో యజ్ఞాః" అనుచో ద్రవ్య యజ్ఞమును వివరించుచు "కేచిత్కర్మ యోగినః ద్రవ్యయజ్ఞాః న్యాయతో ద్రవ్యాణ్యు పాదాయ దేవతార్చనే ప్రయతన్తే" అనగా కొందరు కర్మయోగులు న్యాయమార్గమున ద్రవ్యము నార్జించి దేవతార్చన గావించుటకై ప్రయత్నింతురు' అనియును సాయించిరి.

ఇంకను 3వ యధ్యాయములో-

"యజ్ఞశిష్టాశిన స్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః।"

"తే త్వఘం భుఞ్జతే పాపాః యే పచన్త్యాత్మకారణాత్."
[3 అ. 13 శ్లో]

అను శ్లోకమునకు శ్రీభాష్యకారులు -

పరమపురుషుని యారాధనార్థమై ద్రవ్యములు నార్జించి వండి దానిని పరమపురుషునకు నివేదించి యాశేషముతో తన శరీరమును పోషించుకొనువారనాదికాలము నుండియు నార్జించిన పాపములన్నిటి నుండియు విముక్తులగుదురు. అట్లుచేయక వాటితో కేవలము తనకడుపునే నింపుకొనువాడు పాపమునే తినుచున్నాడని యన్వయ వ్యతిరేకములచే నర్చారాధనను విధించెనని సాయించిరి. ఇట్లు భగవానుని కభిమత మీ యర్చారాధన యనుట నిర్విశంకము.

ఇట్లు భగవన్నివేదిత పదార్థములనే మనమెల్లప్పుడు నుపయోగించవలె ననుట వీరి సిద్ధాంతమున నొక ముఖ్యాంశము.

ఈ పై ప్రమాణమువలననేగాక - 17వ యధ్యాయమున సాత్త్విక, రాజస, తామసాహార పరిగణనను చేయుచున్నప్పుడు తామసాహారమునుగూర్చి -

"యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్"
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్"

అను 10వ శ్లోక వ్యాఖ్యానమున భాష్యకారులు-

అమేధ్యం - అను పదమునకు - అయజ్ఞార్హం-అనగా అయజ్ఞ శిష్టం' అని వ్యాఖ్యానమును గావించిరి.

దీనికి వేదాంత దేశికులు తాత్పర్యచంద్రికలో -

మేధాఽత్ర యజ్ఞః - తదర్హం = మేధ్యం - తద్విపర్యయం. అనగా - మేధయనగా యజ్ఞము - అనగా భగవదారాధనము - దానికి తగినది మేధ్యము. అందులకు తగనిది. యమేధ్యము. అనగా - భగవంతుని యారాధనకు = నివేదనకు తగనిది. భగవంతునకు నివేదింప బడనది తామసాహారమనబడును. అది పాపవర్ధకము అని సాయించిరి

మరియును మూడవ యధ్యాయమున 36వ శ్లోకమున నర్జునుడు శ్రీకృష్ణుని -

"అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః"

అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః,' (3అ 36శ్లో)

అని ప్రశ్నించెను. అనగా—"జ్ఞానయోగము నమష్ఠించు పురుషుడు పాపమును చేయకోరకున్నను లోపలనుండి దేనిచేతనో బలాత్కారముగా త్రోయబడినట్లుగా పాపములను చేయుచున్నాడు. అట్లు చేయించునదేది" యని ప్రశ్నించగా భగవానుడు -

"కామ ఏషః క్రోధ ఏషః రజోగుణ సముద్భవః"

అని ప్రత్యుత్తర మొసంగెను.

అనగా రజోగుణమువలన బుట్టునట్టికామమున్ను' అది ముదు రుటచే క్రోధమున్ను, ఆపాపములను చేయించుచున్నవిగాన ఆకామమును ముందు ముఖ్యముగా జయింపుమని హెచ్చరించెను. ఆ కామమును జయింపవలెననిన దానిని బుట్టించు రజోగుణమును నిర్మూలింపవలెను. దానిని నిర్మూలింపవలెననిన -

శ్లో॥ "రజస్తమ శ్చాభిభూయ సత్వం భవతి భారత"
[14 అ. 10వ శ్లో]

అనునట్లు సత్త్వగుణమును వృద్ధిపొందించవలెను. దానికి సాత్వికపదార్థ సేవన మావశ్యకము. పదార్థము సాత్విక మగుట భగవత్సంబంధము వలన, అట్టి భగవత్సంబంధము అర్చారాధనవలననే.

ఇందువలనను భగవద్గీతలో ముముక్షువులు భగవన్నివేదిత పదార్థములనే ముఖ్యముగా నుపయోగించవలెనని నిశ్చయింపబడెను.

## 8 వైదిక కర్మల నాచరించు విధానము

రామానుజ దర్శనమున మనముచేయు శాస్త్రవిహిత వర్ణాశ్రమ కర్మలెల్లను భగవత్కైంకర్య బుద్ధితో నాతని ప్రీతికొఱకే ఫలసంగ కర్తృత్వముల వీడి చేయవలెనని విధింపబడెను. ఇదియును గీతాసిద్ధాంతమే చూడుడు.

శ్లో॥ "యజ్ఞార్థాత్కర్మణో ఒన్యత్ర లోకో ఒయం కర్మబంధనః।
తదర్థం కర్మకౌన్తేయ ముక్త సఙ్గ స్సమాచర॥"

"భగవదారాధన కొఱకై చేయు కర్మ భగవత్ప్రసాద హేతువే కావున కర్మల నన్నిటిని భగవత్కైంకర్య బుద్ధితో గావింపుము" అని యుపదేశించెను.

మఱియు తొమ్మిదవ యధ్యాయమున -

శ్లో॥ యత్కరోషి.........తత్కురుష్వ మదర్పణమ్"

అను ఇరువదియేడవ శ్లోకమున నీవు చేయు దేహధారణోపయోగములగు భోజనాది లౌకిక కర్మలను, హోమ దాన తపః ప్రభృతి నిత్య నైమిత్తిక కర్మలను నాకర్పింపుము' అని యుపదేశించెను.

పదునెనిమిదవ యధ్యాయమున-

శ్లో॥ "యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతం।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః॥"

అనగా "ఏ భగవంతునినుండి సమస్త భూతములను పుట్టుచున్నవో, ఎవ్వనిచే వ్యాపింపజేయబడినవో యట్టి భగవంతుని తన వర్ణాశ్రమ ధర్మములతో నారాధించిన మానవుడు సిద్దిని పొందుచున్నాడ"నియును తెలవిచ్చుటచే కర్మల నన్నిటిని ఈ భగవదారాధనపూర్వకముగ చేయవలెను. ఇట్లుచేసినచో-

శ్లో॥ "సర్వ కర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్"
(56 శ్లో॥)

అనగా_సకల నిత్యనైమిత్తిక కామ్యకర్మలను నాయందు కర్తృత్వాదుల నుంచి యాచరించువాడు నా యనుగ్రహమువలన శాశ్వత పదవి నధిరోహించు చున్నాడు.

తృతీయాధ్యాయమున_

శ్లో॥"మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా।
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగత జ్వరః॥"
(3అ. 30వ శ్లో.)

అనగా నీవు నాకు శరీరభూతుడవుగాన నాచే ప్రేరేపింపబడియే సకల కర్మలను చేయుచున్నావు. అందుచే నాకర్మల కన్నిటికిని కర్తను నేనే యనియు, నవి యన్నియును నా యారాధన రూపములే యనియును నిశ్చయించి, యాకర్మఫలములయందాశను, వాటియందు మమకారమును లేక "నాకు పరమాత్మ అంతర్యామి అతడే కర్త. నా దేహేంద్రియము లాతని పరికరములు. ఇవి యాతని యారాధనకొఱకే యొసంగబడినవి. ఆతడు సర్వశేషి. సర్వేశ్వరుడు. తానే తన సేవను నాచే చేయించు కొనుచునా" డని తలంచి అనాదికాలమునుండియు నేను చేసిన పాప రాశినుండి నేనెట్లు విముక్తుడ నగుదును? నే నేమగుదునో" అను మన స్తాపములేక 'నేను చేయు కర్మలచే నారాధింపబడు నా భగవంతుడే నన్ను సంసార బంధమునుండి విముక్తుని చేయగలడ''ని నిశ్చింతతో కర్మయోగము నాచరింపుమని యుపదేశించెను.

ఆపైన 31, 32 శ్లోకములచే నిట్లాచరించువారు ముక్తులగుదురు. ఇతరులు బద్ధులగుదురని అన్వయ వ్యతిరేకములచే నీసిద్ధాంతమును బలపఱచెను.

మఱియొక వ్యాఖ్యానకర్త -

శ్లో॥ "సుఖ దుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి"
[2 అ 38వ శ్లో]

అను శ్లోకమునకు పై సిద్ధాంతమున కనుగుణముగ నిట్లొక చక్కని యర్థమును చెప్పిరి,

'ఏదైననొక లౌకికముగాని వైదికముగాని వర్ణాశ్రమమునకు తగిన కర్మను చేయునప్పుడు దానివలనకలుగు సుఖమును, దుఃఖమును, లాభమును,నష్టమును, జయమును, అపజయమును, భగవంతునకర్పించి వేయుము. ఇట్లు చేసిన పాపమునకు పాల్పడవని సెలవిచ్చెను. ఇందలి 'సమే' అను పదమునకు-మయా = లక్ష్మ్యా సహితః సమః = శ్రీమన్నారాయణః. తస్మిన్ – సమే. అనగా శ్రీమన్నారాయణుని యందని యర్థము వచ్చుచున్నది.

## 9 దేవతాంతరములయందు పరత్వ బుద్ధి పరిత్యాజ్యము

మహోపనిషత్తు, సుబాలోపనిషత్తు, నారాయణోపనిషత్తులు "ఏకో హ వై నారాయణ ఆసీత్। న బ్రహ్మా నేశానః।" అనగా ప్రళయసమయమున నారాయణుడొక్కడేయుండెను, బ్రహ్మరుద్రాదులు లేరనియు.

"అథ పురుషో హవై నారాయణోఽ కామయత"

అనగా అపు డానారాయణుడు చేతనాచేతన సృష్టికి సంకల్పించెననియు, తైత్తిరీయోపనిషత్తు

"యతో వా ఇమాని భూతాని జాయన్తే। యేన జాతాని జీవన్తి। యత్ప్రయన్త్యభిసంవిశన్తి" అనగా పై ప్రమాణములందు యచ్ఛబ్ద వాచ్యుడు నారాయణుడేయనియు,అతని నుండి శరీరముతో కూడి ప్రాణు లన్నియు పుట్టుచున్నవనియు. అతని వలననే జీవించుచున్నవనియు, ప్రళయ సమయమున ఆతనియందే విలీన మగుచున్నవనియు, మోక్ష మున అతని సాయుజ్యమును బడయుచున్నవనియును, చెప్పుచుండుటచే నారాయణుడే బ్రహ్మరుద్రేంద్రాదులను పుట్టించువాడగుటచే అతడే పర తత్వమని రామానుజ సిద్ధాంతము.

"కారణం తు ధ్యేయః" అను శ్రుతి వాక్యమువలన కారణవస్తువే ధ్యానించతగినదని తెలియుటచే రామానుజులాతనినే భజింతురు. "ఫల మత ఉపపత్తేః" అను బ్రహ్మసూత్రముచే చతుర్విధ పురుషార్థముల నొసంగువాడు నారాయణుడే యని రామానుజులు మోక్షార్థ మాతనినే సేవింతురు.

నారాయణోపనిషత్తునందు "అథ పురుషో హ వై నారాయణోఽ కామాయత ప్రజా స్సృజాయేతి। నారాయణా ద్బ్రహ్మా జాయతే। నారా యణా ద్రుద్రో జాయతే। న్నారాయణా దిన్ద్రో జాయతే" ఇత్యాది వాక్య ములచే బ్రహ్మరుద్రేంద్రాదులు నారాయణునినుండి పుట్టినట్లు చెప్పబడు

టచే వారెవ్వరును పరతత్వము కానేరరు. ఈ నారాయణుని పరతత్వ మును నిర్ణయించుటలో ఉపాసన పరముగాని, అర్థవాదపరముగాని కాని తైత్తిరీయములోని నారాయణానువాకమునందలి క్రింది మంత్రము స్పష్టముగ నారాయణపరత్వమును ప్రతిపాదించుచున్నది.

"నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణం।
నారాయణపరం బ్రహ్మతత్వం నారాయణః పరః।
నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః।"

అని ఈ యర్థమును గీత యెట్లు సమర్థించుచున్నదో కొంత విచారింతము.

"మమ యోని ర్మహ ద్బ్రహ్మ। తస్మిన్గర్భం దధా మ్యహమ్"
సర్వజగత్కారణభూతమైన మూలప్రకృతి నాయధీనమైనది. దాని యందు గర్భమనబడు జీవులను వారివారి కర్మానుగుణముగా నేనే ప్రవేశపెట్టెదను. అందువలననే సమస్తప్రాణులును పుట్టుచున్నవి.

"యావత్సంజాయతే కిఞ్చిత్। సత్త్వం స్థావర జఙ్గమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్। తద్విద్ధి భరతర్షభ!॥"
(గీత. అ.13. శ్లో. 8.)

స్థావర జంగమ రూపములగు ప్రాణులన్నియును నేను గావించు ఈ ప్రకృతి పురుషసంయోగమువలననే పుట్టుచున్నవి - అని సృష్టికర్త తానే యనియు "మత్స్థాని సర్వభూతాని" గీత 9 అధ్యాయమున

నాయందే సర్వభూతములు ఆధారపడియున్నవి. "న చాహం తేష్వవస్థితః" నేను వానియందాధారపడి యుండను-అని స్థితికర్త తానే యనియు, "అ.32 శ్లోకమున" "కాలోఽస్మిలోకక్షయకృత్ప్రవృద్ధః లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః" అని సంహారకర్తను తానే యనియు, 7వ అధ్యాయ 14 శ్లోకమున "మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే" నన్నే ఉపాయముగా నమ్మియున్న పుణ్యాత్ములు మోక్షమున కాటంకమగు మాయను దాటి పరమపదము నలంకరింతురని చెప్పుటచేతను సృష్టి, స్థితి సంహారకర్తయు, మోక్షప్రదుడును నారాయణుడే. కావున అతడే పరతత్వము.

"యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి" (గీత 7. అధ్యా 8. శ్లో)

అను శ్లోకమును 'తనుం' అను శబ్దముచే బ్రహ్మాది దేవతలందరును తన శరీరభూతులేయని "స ఆత్మా" అఙ్గాన్యన్యాదేవతాః" అను శ్రుతి వాక్యముతో సమన్వయ పరచుచు వెలవిచ్చుటచే బ్రహ్మరుద్రేంద్ర సూర్యచంద్రాగ్న్యాది దేవతలందరును తనకు శరీరభూతులే యనియు, అందుచే "యే త్వన్య దేవతా భక్తాః యజన్తే శ్రద్ధయా న్వితాః తేఽపి మామేవ యజన్తి"

అనగా దేవతలందరును నాకు శరీరభూతులే యగుటచే నన్నే ఆరాధించుచున్నట్లు పర్యవసించుచున్నది. ఒక ప్రభువు, తాను ధరించిన దుస్తులపై సమర్పించిన మాలను తనకే సమర్పించినట్లు భావించినట్లే.

శ్లో॥ "ఆ బ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోఽర్జున।
మా ముపేత్య తు కౌన్తేయ! పునర్జన్మ న విద్యతే॥"

అనగా ఆ బ్రహ్మాదులును వారి లోకములును నశించునవి. కావున వారి నుపాసించి యాయా లోకములలో నాయా ఫలముల ననుభవించువారును తిరిగి సంసారమున బుట్టుచుందురు. కాని సర్వజ్ఞుడను, సత్యసంకల్పుడను, నిఖిల జగత్సృష్టి సంహారకుడను, పరమకారుణికుడను నద్వైకరూపుడను నగు నన్ను బొందినవారికి తిరిగి జన్మలేదని సెలవిచ్చెను. బ్రహ్మాదులకును గూడ నాధికర్త నారాయణుడే యని 11 వ అధ్యాయమున—

శ్లో॥ "కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్ గరీయసే
బ్రహ్మణోఽప్యాది కర్త్రే."

బ్రహ్మాదులకును సృష్టికర్తవగు నిన్ను బ్రహ్మాదులేల స్తుతింపకుందురని స్తుతించెను.

మఱియు 15 వ శ్లోకమున—

శ్లో॥ "పశ్యామి దేవాం స్తవ దేవ దేహే
సర్వాం స్తథా భూత విశేషసంఘాన్
బ్రహ్మాణ మీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్॥"

అనగా 'ఓ విశ్వశరీరా, దేవా నీ శరీరములో నేను సమస్త దేవతలను జూచుచున్నాను. సామాన్య దేవతలనేకాదు లోకులు పరతత్త్వముగా భావించు కమలాసనుడగు బ్రహ్మను, ఆ బ్రహ్మకు వశవర్తియై వర్తించు రుద్రుని, దేవర్షులను, వాసుకి, తక్షక ప్రభృతి సర్పములను జూచుచున్నానని చెప్పెను.

దీనినిబట్టి లోకులు పరతత్త్వమని భ్రమించి పూజించి యుపాసించు బ్రహ్మరుద్రాదులను శ్రీమన్నారాయణుని రోమకూపములో నొకమూల మిణుకు మిణుకుమని మెఱయు నల్పులేయని తెలియుచున్నది.

## 10. జీవుల కీశ్వరునితోను పరస్పరమున్న భేదము తాత్త్వికము

భగవద్రామానుజ దర్శనమున జీవేశ్వరభేదమున్న. జీవపరస్పర భేదమున్న యథార్థమే. ఈవిషయమును భగవద్గీతయెట్లు సమన్వయ పఱచుచున్నదో పరిశీలింతము.

ఆత్మతత్త్వము నెఱుంగక దుఃఖించు నర్జునుని దుఃఖమును బాపుటకు "తరతి శోక మాత్మవి" త్తనెడు ఉపనిషద్వాక్య ప్రమాణాను సారముగ నాత్మయాథాత్మ్యమును బోధించుట కుపక్రమించి శ్రీకృష్ణ భగవాను డాదిలోనే_

శ్లో॥ "న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః"

అవి యాత్మ నిత్యత్వమును బోధించుటలో 'నేను నీవు' అనుటచే జీవేశ్వర భేదమున్ను 'నీవును ఈరాజులు, ననుటచే జీవులలో పరస్పర భేదమున్ను తాత్వికమని తెలియుచున్నది.

మఱియు నేడవ యధ్యాయమున నైదవశ్లోకమున—

"ఇత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం।
జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్"॥

అనగా ఇపుడు చెప్పిన నాయచేతన ప్రకృతికంటే వేరైననా పరాప్రకృతి యొకటి కలదు. అది జగత్తునంతటిలోనుండి దానిని ధరించియుండుజీవప్రకృతి. అదియును నా యధీనమే. అనగా నాకు శేషభూతమే యని చెప్పుటచే జీవేశ్వర భేదము సిద్ధము.

పదునైదవ యధ్యాయమునందలి యేడవ శ్లోకమున—

శ్లో॥ "మమైవాంశో జీవలోకే జీవ భూత స్సనాతనః"

అనగా సనాతనమగు జీవాత్మ నాయంశయే యనుచు అది అనాది కర్మచే నావరింపబడి జీవత్వమునొంది ప్రపంచములో దేవమనుష్యాది ప్రకృతి పరిణామ విశేషములగు శరీరములలో నల్లాడుచున్నదని తెలుపుటచేతను, జీవతత్త్వము పరమాత్మ తత్త్వముకంటె వేరైనదని తెలియుచున్నది.

అదే 16, 17 శ్లోకములలో—

శ్లో॥ ద్వా విమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే।
ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః॥

లోకమున క్షరపురుషుడనియు, నక్షరపురుషుడనియు నిరువురు పురుషులు కలరు, అందు క్షరపురుషుడనగా బ్రహ్మాది పిపీలికాపర్యంతము గల బద్ధాత్మవర్గము. అక్షరమనగా ముక్తాత్మవర్గము ఉత్తమపురుషుడీ యుభయ విధాత్మ వర్గముకంటె వేరైనవాడు. అతనినే పరమాత్మ యని వ్యవహరింతురు. అతడు ప్రకృతిలోను, బద్ధాత్మవర్గమందును, ముక్తాత్మవర్గమునందును అంతరాత్మగా వ్యాపించియుండి వాటిని ధరించి యుండును, వ్యాపించువాడును ధరించువాడును వ్యాపింపబడువాటి కంటెను ధరింపబడువాటికంటెను వేఱుగదా! అత దవ్యయుడును ఈశ్వరుడును, గాన వ్యయస్వభావముగల ప్రకృతి కంటెను, అట్టి ప్రకృతితో కూడియుండుటచే నట్టి స్వభావమేగల బద్ధాత్మవర్గము కంటెను, కొంతకాల మాప్రకృతిలోనుండి దాని వికారములకు గురియైన ముక్తాత్మవర్గముకంటెను, వేఱుకదా! ఈశ్వరుడగు నా నియామకుడు 'ఈశితవ్యము' అనగా నియామ్యమగు ప్రకృతి, బద్ధ, ముక్తాత్మలకంటెను వేఱుకదా !

ఆత్మలను చెప్పుచోటులనెల్ల బహువచనముచే చెప్పుట చేతను 7 వ అధ్యాయమున 28 వ శ్లోకమున—

శ్లో॥ "యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్య కర్మణాం॥
తే ద్వంద్వ మోహ వినిర్ముక్తాః..............."

అనగా ఎవరికి నన్ను భజించుటకు విరోధియగు అనాదికాలము నుండియు వచ్చుచున్న పాపము బహుజన్మార్జిత పుణ్యవిశేషముచే నశించు చున్నదో యని చెప్పుటచేత పాపము సమూలముగా నున్మూలమై మోక్షమున కర్హులగువారును. బహువచనముచే చెప్పబడుచున్నారు గాన ఈ భేద మౌపాధిక మనదగదు.

ఎనిమిదవ యధ్యాయమున పదిహేనవ శ్లోకమున-

శ్లో॥ "మా ముపేత్య పున ర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్।
నాప్నువన్తి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః॥"

నన్ను పొందినవారు తిరిగి దుఃఖమున కాలవాలమగు నస్థిరమైన జన్మను పొందరు. ఏలయన ఆ మహాత్ము లత్యంత ప్రేమతో నన్ను ధ్యానించి పరమసిద్ధిని పొందినవారు గనుక. అని ముక్తులను బహువచనముచే వ్యవహరింపబడుటచే ఈ జీవ పరస్పర భేదమున్ను నిత్యమును సత్యమే.

పంచమాధ్యాయమున పదునారవ శ్లోకమున-

శ్లో॥ "జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః
తేషా మాదిత్య వత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥"

అనగా ఎవరికాత్మ తత్త్వోపదేశమును శ్రద్ధగా వినుటచే పుట్టిన యాత్మజ్ఞానము నిరంతరాభ్యాస పాటవమున నిరతిశయ పవిత్రమగునో అట్టి జ్ఞానముచే అనాదికాలమునుండి వారి నాశ్రయించుకొనియున్న

యజ్ఞాన సముదాయమంతయు నశించును. అంత వారికి స్వాభావికమైన పరజ్ఞానము సంకోచరహితమై సూర్యునివలె ప్రకాశించునని సాయించిరి.

"తేషా మితి వినష్టాజ్ఞానానాం బహుత్వాభిధానాత్ ఆత్మ స్వరూప బహుత్వం నత్వే వాహం జాతునాస మిత్యుపక్రమావగత మత్ర స్పష్టతరమ్, నచేదం బహుత్వ ముపాధికృతం, వినష్టా జ్ఞానా ముపాధి గన్ధా భావాత్" అని భాష్యకారులు సాయించిరి.

అనగా 'తేషాం' వారికి అని అజ్ఞానము లేనివారి నట్లననేకులుగా బహువచనముతో చెప్పుటచే 'నత్వేవాహ' మ్మని ప్రారంభమువనే చెప్పబడిన యాత్మ బహుత్వమచ్చట స్పష్టపరుపబడినది. ఇది యుపాధివలన వచ్చినదనుటకు వీలులేదు. అజ్ఞానమే నశించి పోయిన వీరికి ఉపాధిగంధమైనను దరిచేరునా?

ఈయుపపాదనలచే జీవులకు భగవంతునితోను, పరస్పరమును్ను భేదము స్వాభావికమని నిశ్చితమైనది కాన దీనినే రామానుజా లాదరించిరి.

జీవు లణుపరిమాణముకలవారు. నిత్యమైనవారు. శేషత్వ పారతంత్ర్యములు వీరికి ప్రధానలక్షణములు.

లోకమున పరిమాణము విభుపరిమాణము మధ్యమపరిమాణము అణుపరిమాణమని మూడువిధములు. అందు నైయాయికులు జీవులు విభుపరిమాణము కలవారనియు, జైనులు మధ్యమపరిమాణముకలవారని

యును చెప్పుదురు. ఆ పక్షములలో దోషములుండుట చేతను దీనిని శాస్త్ర మాదరించుటచేతను జీవులణుపరిమాణము కలవారని శ్రీభాష్య కారులు సిద్ధాంతీకరించిరి

ఈవిషయమును గీత యెట్లు సమర్థించుచున్నదో చూతము.

2 వ అధ్యాయమునందలి 17 వ శ్లోకమున

"అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్।
వినాశ మవ్యయస్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి॥"

ఆత్మతత్వము నిత్యమని చెప్పుట ముఖ్యాంశము. దీనికి భాష్యము.

యేనాత్మతత్వేన చేతనేన తద్వ్యతిరిక్త మిదమ చేతన తత్వం సర్వం తతం-వ్యాప్తం వ్యాపకత్వేన నిరతిశయ సూక్ష్మత్వా దాత్మనో వినాశానర్హస్య తద్వ్యతిరిక్తో న కశ్చిత్పదార్థో వినాశం కర్తు మర్హతి' అనగా ఆత్మలు పదార్థములన్నిటిలోను వ్యాపించియున్నవి. అందుచే నచేతనములు వ్యాప్యములును, జీవులు వ్యాపకులు నగుచున్నారు. వ్యాప్యకముకంటె వ్యాపకము సూక్ష్మముగా నుండవలెనుగదా! అందుచే నాత్మను దానిచే వ్యాప్యమగు నాశన సాధనమేదియును నశింపచేయ జాలదు. కాబట్టి ఆత్మనిత్యము.

(ఈశ్లోకార్థము ముందు విపులముగా వ్రాయబడును. ప్రస్తుత మాత్మ అణుపరిమాణమని చెప్పుటకే యీ శ్లోకమిచ్చుట ప్రమాణీక రింపబడినది.)

ఈవిషయమును-

"ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః,
అరాగ్ర మాత్రోహ్యవరో హి దృష్టః,
వాలాగ్ర శతభాగస్య శతధా కల్పితస్య చ,
భాగో జీవస్స విజ్ఞేయః,

ఇత్యాది శ్రుతివాక్యములున్ను

సూ. 'ఉత్క్రాన్తి గత్యాగతీనాం' 'స్వశబ్దోన్మానాభ్యాం చ' అను సూత్రములచేతను సిద్ధాంతీకరింపబడెను. దీనిని రామానుజులు తమదర్శనమున స్వీకరించిరి.

ఈయాత్మ నిత్యమనియును వీరిసిద్ధాంతము, ఈ విషయమును గీత యిట్లు సమర్థించుచున్నది.

శ్లో॥ "అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్"

అన్నింటిలోను ప్రవేశించి యుండునంత సూక్ష్మమైనదగుటచే ఆత్మనిత్యమని సమర్థింపబడెను. దీనిని భాష్యకారులు చక్కని యుక్తులతో గీతా భాష్యమున వివరించిరి. ఆ విషయమును ముందు వ్రాయుదును. ప్రస్తుతము యథాశ్రుతార్థమును జూతము, ఇది యాత్మనిత్యమని సమర్థించు ప్రకరణము. అన్నిటిలోను వ్యాపించి యుండవలెనన్న అన్నిటికంటెను సూక్ష్మమైనది కావలెను. నశింపజేయు సాధనములు, నశింపజేయబడు పదార్థములలో వ్యాపించి వాటిని నశింపజేయుట లోకానుభవసిద్ధము, అట్లాత్మలను నశింపజేయవలెనన్న వానిలో ప్రవేశింపవలెను. అందులకు వానికంటె సూక్ష్మమై



యుండవలెను. అట్లు నాశనముచేయు దానిలోకూడ ఆత్మ వ్యాపించి యున్నదనుటచే ఆత్మలోవ్యాపించదగు వస్తువు వేఱొకటిలేదుగదా! కావున ఆత్మ నిత్యము. అందుచేతనే 'నైనం ఛిందంతి శస్త్రాణి' 'అచ్ఛేద్యోఽయం' అనుశ్లోకములు ప్రసక్తమైనవి. ఇందు మొదటి శ్లోకము శస్త్రాదులకు ఆత్మను నశింపజేయుటలో కర్తృత్వము లేదని యును. రెండవశ్లోకము నశించుస్వభావము లేదనియును తెలుపుచున్నవి అందులకే యారంభములో నాత్మలను "అగతాసూన్" అని పేర్కొనెను. అనగా నశించనివని యర్థము.

## 12 (అ) శేషత్వము:-

శేషత్వమనగా ఒకని కతిశయమొనగూర్చుటకై యతనికి యథేష్టముగ వినియోగించ తగియుండుట. దీనినే శాస్త్రకారులు 'పరగతాతిశయాధాయకత్వం శేషత్వమ్-పరశ్శేషీ' అని నిర్వచించిరి. దీనినే యభిజ్ఞులు

శ్లో॥ "ఇచ్ఛయా యదుపాదేయం పరాతిశయ సిద్ధయే।
ఉభయానుభయైకైక జుషా తౌ శేష శేషిణౌ॥"

అని తెలివిత్తురు. అనగా ఉభయ గతేచ్ఛయా, అనుభయ గతేచ్ఛయా, ఏక గతేచ్ఛయా-ఎవనిచే నేవస్తువు తన యతిశయమును గూర్చుటకై గ్రహింపబడుచున్నదో అట్లు గ్రహింపబడునది శేషమనియు గ్రహించువాడు శేషియనియు దీనియర్థము. ఇట్టి శేష శేషిభావమిద్దఱు చేతనుల

కుండవచ్చును. రెండచేతనముల కుండవచ్చును. ఒకటి చేతనమును రెండవది యచేతనమును కావచ్చును. మొదటిది నౌకరు - యజమాని వీరిద్దఱికిష్టమున్ననే యీ శేష శేషిభావము ఘటించును. రెండవది. పందిరి-తోరణము-ఇందిచ్చ యీ రెండింటిలో దేనియందునులేక యవ్య చేతన గతమగును. మూడవది మనుష్యుడు-ఇల్లు. ఇందు మనుష్యునకు మాత్రమే యిచ్ఛయుండును. ఇట్టి శేష శేషి భావమును భాష్యకారులు జీవేశ్వరుల కంగీకరించిరి. దీనిని గీత యెట్లు సమర్థించుచున్నదో గాంచుడు.

గీతలోననేకస్థలముల తనకు సేవనుచేయుమనియు, నమస్కరింపు మనియు, తనగుణములను పాడుమనియు, తనకున్నవన్నియు తనకర్పింపు మనియు, తననే దిక్కని నమ్మియుండుమనియు, అట్లున్న వానట్టివాని రక్షణభారమును వహింతుననియు, పరమాత్మ తెలిపియుండెను. ఇందుల కెన్నియో ప్రమాణశ్లోకములు గీతలో కలవు.

'మన్మనాభవ' 'మత్కర్మకృత్' 'అనన్యాశ్చిన్తయన్తోమాం'
యే తు సర్వాణి కర్మాణి, 'తమేవ శరణంగచ్ఛ,'
"మామేవ యే ప్రపద్యన్తే" "మామేకం శరణం వ్రజ"
'తమేవ చాద్యంపురుషం ప్రపద్యేత్' 'స్వకర్మణా తమభ్యర్చ్య'

ఇత్యాదులు,

## (ఆ) పారతన్త్ర్యము.-

అనగా పరఏవతంత్రం-ప్రధానం యస్య సః పరతన్త్రః. తస్యభావః పారతన్త్ర్యం. అనగా తానెట్టికార్యములలోను స్వాతంత్ర్యము నవలంబించక ప్రతిపనిలోను ఆయన ఆదేశమునే శిరసావహించి చెప్పినట్లుచేయుచుండుట. దీనిని శేషత్వమువలెనే ఆత్మ ప్రధాన లక్షణముగా శ్రీభాష్యకారులు తమ సిద్ధాంతములో నాదరించిరి. శేషత్వముకన్న నిదిగొప్పదిగా పరిగణింపబడును. 18 వ అధ్యాయమున 58. 59 వ శ్లోకముల నారయుదు.

"మచ్చిత్త స్సర్వ దుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి" నాకువరతంత్రుడవై నేను ప్రవర్తింపచేయుటచేతను నీవు ప్రవర్తించుచున్నావని తలంచి కర్మలనుచేసినచో నాయనుగ్రహమువలన సాంసారిక యిక్కట్లను బాయగలవు.

"అథ చే త్త్వ మహఙ్కా రా న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి"
(18 అ. 58 శ్లో)

నా కర్తవ్యా కర్తవ్యములను నేనే యెఱుంగుదునని స్వాతంత్ర్యము నవలంబించి నా యుపదేశములను పాటించనిచో నశింతువని నిర్ధాక్ష్యముగా చెప్పివేసెను.

మరియు-

యదహఙ్కార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి,
(18 అ 59 శ్లో)

స్వాతంత్ర్యాభిమానముతో నాయాజ్ఞ నుల్లంఘించి నేను నీకు సహజ ధర్మముగా విధించిన కర్మ (యుద్ధము) ను చేయనిచో నిట్టి నీస్వాతంత్ర్యము వ్యర్థమే. నా స్వాతంత్రయమును లక్ష్యపెట్టని నిన్ను నీ సహజ స్వభావము నీ చేతను నీకు విధింపబడిన పనిని చేయించియే తీరును. నాయాదేశమును పాటించి గావింతువా నేను నీ భారమునంతను వహించి నీకెట్టిపాపమును రానీయను. నీ యంతనే యుద్రేకించి స్వేచ్ఛగా ఆ పనినే తరువాత చేసియే తీరుదువు. అపుడు నీకు వివేక ముండదు, నే నుపేక్షింతును. నీకు దానివలన నన్ని యిక్కట్టులును వాటిల్లును. పాపి వగుదువు. అని హితము నుపదేశించెను. దీనిచే జీవుని పారతంత్ర్యము స్ఫుటమేగదా !

శ్లో॥ "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా"
(18 అ 61 శ్లో)

అను శ్లోకమీ పారతంత్ర్యము నింకను స్పష్టతరముగా తెల్పుచున్నది.

## 13. చాతుర్వర్ణ్య వ్యవస్థ

మనదేశమున వర్ణాశ్రమ వ్యవస్థ ముఖ్యముగా పాటింపబడు చున్నది. మనుష్యలోకముననేగాక దేవతలలోనున్ను ఈవ్యవస్థ యున్న ట్లుగాశాస్త్రములుగ్గడించుచున్నవి. వీనిని భగవానుడే యేర్పఱచినట్లున్ను, ఇది మిక్కిలి యావశ్యకమనియు భగవానుడు గీతలో నుపదేశించెను. నిష్కామకర్మయోగము నుపదేశించి ముముక్షువులందఱకు నిది ప్రథమ

కర్తవ్యమనియు జన్మసిద్ధజ్ఞాననిష్ఠునకును వేయేల? భగవంతు డేయీలోక మున నవతరించినను ఆ యవతారజన్మకు తగినకర్మల నాచరింపవలె ననియు వెలవిచ్చెను.

శ్లో॥ న మే పార్థా స్తి కర్తవ్యం త్రిషు లోకేషు కిఞ్చన
నా నవా ప్త మవా ప్తవ్యం వర్త ఏవ చ కర్మణి"

నేను సత్యసంకల్పుడను. అవాప్త సమస్తకాముడను. నాకే ప్రయోజనమునకు గాని ఏపనిని గాని చేయవలసిన యవసరములేదు. అయి నను లోకకళ్యాణమునకై నా వర్ణాశ్రమ ధర్మముల నేను పాటించుచునే యున్నాను. కావున లోకమున ప్రతిమానవుడును తన వర్ణాశ్రమ ధర్మ ముల నాచరించియే తీరవలెనని, దీనిమూలమున మోక్షమభవము నందగలరనియు నుపదేశించి దానికి దృష్టాంతముగ—

శ్లో॥ "కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః"

అని ఈకర్మయోగముచే జనకాదులు ముక్తినిబడసిరని తెలిపెను. అయి నచో లోకులందఱును నిష్కామకర్మయోగు లేల కాలేదని ప్రశ్నింపగా దానికి కారణ మల్పఫలములయం దాశనుపుట్టించు పాపమే యనెను. ఈ పావ మందరికి నుండునే! పుణ్యాపాపముల మిశ్రమ ఫలానుభవ మున కేకదా మానవశరీరము. ఇక నిష్కామ కర్మయోగియై ముక్తు డగువా దెవ్వడని ప్రశ్నింపగా తన సృష్టి రహస్యము నెఱింగిన నీ పావము నశించి నిష్కామకర్మ యోగియై ముక్తిని బడయగలడని నాలుగవ యధ్యాయమున పదమూడవ శ్లోకమున దెలిపెను.

8) 

శ్లో॥ "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః"

"చాతుర్వర్ణ్యప్రముఖం బ్రహ్మాది స్తమ్బపర్యన్తం కృత్స్నం జగత్ సత్త్వాది గుణవిభాగేన తదనుగుణ శమాది కర్మవిభాగేన చ విభక్తం మయా సృష్టమ్" అనగా బ్రహ్మాదిదేవతలలోను మనుష్యులలోను సత్త్వరజ స్తమో గుణములనుబట్టియు దానికి తగిన శమ దమాది కర్మలనుబట్టియు నాలుగువర్ణములను నేనే సృష్టించుచున్నానని సెలవిచ్చెను.

శ్లో॥ "న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే॥"

ఇట్లు సృష్టించినను దానివలన నాకు నిర్దయత్వ పక్షపాతాది దోషములు లేవు. దానికి కారణము ఆ సృష్టిఫలముతో నా కోరికలేకుండుటయే. ఇట్లే ఫలసంగ కర్తృత్వములను విడి వారి వారికి నిర్ణయింపబడిన వర్ణాశ్రమ ధర్మముల నాచరించువారు నావలెనే కర్మలచే బంధింపబడరని సెలవిచ్చెను. ఈ సృష్టి గుణకర్మలనుబట్టి యెట్లు జరిగినదనగా-

పూర్వజన్మమున చేసిన కర్మలనుబట్టి సత్త్వాదిగుణముల న్యూనాధికభావముండును. పూర్వజన్మమున రజస్తమస్సు లణగి సత్త్వగుణము ప్రధానముగ నున్నచో బ్రాహ్మణుడుగ పుట్టును.

ఆతనికి సుఖకరమగు కర్మలు—

శ్లో॥ "శమో దమ స్తప శ్శౌచం శాన్తి రార్జవ మేవచ।
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్॥"
(18 అ 42 శ్లో)

బాహ్యేంద్రియజయము, మనోనిగ్రహము, శాస్త్రసిద్ధమైన భోగ సంకోచముచే శరీరమును కృశింపజేయుట, శాస్త్రీయమగు కర్మలను చేయుటకు యోగ్యతనొసంగు స్నాన సంధ్యా భగవదారాధనము, కారణ మున్నను చిత్తము చలింపకుండుట, మనోవాక్కాయము లేకరూపము గానుండుట, పరావరతత్వ యాథాత్మ్య జ్ఞానము, పరతత్వముయొక్క యసాధారణ ధర్మముల నెఱుంగుట, వేదములు ఉపబృంహణములు భగవంతుడు మొదలగునవన్నియు సత్యమను విశ్వాసము - ఇవి బ్రాహ్మణునకు ముఖ్యధర్మములు.

రాధ్వజన్మమువ తను స్సత్వగుణముల నణచి రజోగుణ మధిక ముగ మన్నచో క్షత్రియుడుగ జన్మించును. అతనికి స్వాభావికమగు కర్మలు—

శ్లో॥ శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్య పలాయనం।
దాన మీశ్వర భావ శ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్॥

యుద్ధమున నిర్భయముగ ప్రవేశించు శక్తి, పరులచే తిరస్కరింపబడకుండుట, ఆరంభించిన పనులెన్ని విఘ్నము లెదురైన్నను విడువక పూర్తిచేయుట, అన్నిపనులను స్వతంత్రముగా చేయగల సామర్థ్యము, చనిపోవు స్థితిలోనైనను యుద్ధములో వెనుకంజ వేయకుండుట,

తనకు ప్రియమగు వస్తువులను ఫలాపేక్ష లేక పరాత్పరుని కొసంగుట, అందఱను పాలించుశక్తి—అను నివి క్షత్రియునకు సాధుకర్మలు.

సత్త్వరజోగుణములు నణచి కొంతవరకు తలయెత్తిన తమోగుణమువలన వైశ్యుడుగా పుట్టును.

శ్లో॥ "కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మస్వభావజమ్"

వ్యవసాయము, పశుపాలనము, వర్తకమనునివి వైశ్యునకు సహజ కర్మలు.

సత్త్వరజస్సుల నణచి పూర్తిగా తలయెత్తు తమోగుణము వలన శూద్రజన్మము కలుగును.

శ్లో॥ "పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్"

పై మూడువర్ణములకు వలయు పదార్థములను తయారుచేసి వారి కందజేసి దానివలన తన జీవనమును గడుపుకొనుట శూద్రునకు సహజ ధర్మము.

ఈకర్మలను పరమాత్మయాజ్ఞ యనుబుద్ధితో ఆతని సమారాధనగా నాచరించిన నాలుగువర్ణములకును ఫలము సమానముగనే భగవంతుడు ప్రసాదించును.

ఈవర్ణములను ఆశ్రమములను తదనుగుణ ధర్మములను ముఖ్యముగ నాచరింపవలెనని భాష్యకారుల యాశయము. తాము రచించిన గీతాభాష్యమున నెచ్చట జ్ఞానప్రసంగము వచ్చినను 'తెలిసికొని యను

ష్టించి యని వ్యాఖ్యానముచేసిరి. 'తెలిసికొనుటకు ఫలమాచరణయేగదా' యని వారు సెలవిచ్చుచుందురు.

భగవద్గీతలోని నాలుగవ యధ్యాయమున నేడవశ్లోకమునకు వ్యాఖ్యానమున 'యదా యదా హి ధర్మస్య' అనుచోట ధర్మశబ్దమునకు

'వేదోదితస్య చాతుర్వర్ణ్య చాతురాశ్రమ్యవ్యవస్థయాఽవస్థితస్య కర్తవ్యస్య' అని సెలవిచ్చిరి. అనగా నాలుగు వర్ణములకును నాలుగు ఆశ్రమలకును ప్రత్యేక ప్రత్యేకముగా వేదమున విధింపబడిన ధర్మమునకు పతనము తటస్థించినచో తానవతరింతునని చెప్పెను.

ఐదవశ్లోకమున "పరిత్రాణాయ సాధూనాం" అను శ్లోకవ్యాఖ్యానమున సాధువులనగా "ఉక్తలక్షణ ధర్మశీలాః వైష్ణవాగ్రేసరాః" అని సెలవిచ్చిరి. ఈ రెండుపదములచేతను సూచింపబడిన యాశయమేమనగా

శ్లో॥ "న చలతి నిజధర్మవర్ణతో యః
సమమతిరాత్మ సుహృద్విపక్షపక్షే
న హరతి న చ హన్తి కిఞ్చిదుచ్చైః
సితమనసం తమవేహి విష్ణుభక్తమ్"

(విష్ణుపురాణము: 3-20)

అనుశ్లోకమున తనవర్ణాశ్రమ ధర్మములను తప్పక లెస్సగ నాచరించువాడును, తన విషయమునవలెనే శత్రుమిత్రులవిషయమునను,

సమబుద్ధికలిగి యుండువాడును ఎవరిసొత్తును హరింపక ఎవరిని హింసింపక రాగాదిదోషములు లేకుండుటచే మిక్కిలి స్వచ్ఛమైన మనస్సుకలవాడును వైష్ణవుడని వైష్ణవలక్షణము విష్ణుపురాణమున జెప్ప బడినది. మఱియును

"వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్"
విష్ణురారాధ్యతే పన్థాః నాన్యస్తత్తోష కారకః॥"

(విష్ణుపురాణము: 3-8-9)

భగవంతుని ప్రసన్నునిగావించుకొనవలెనని ఆతడు విధించిన వర్ణాశ్రమధర్మములను ఆతని యారాధనబుద్ధితో నాచరించుటకంటె వేఱొకమార్గము లేదని విష్ణుపురాణము తెలుపుచున్నది.

ఈవిధమగు వ్యాఖ్యానముచే గీత యుపదేశించిన వర్ణాశ్రమ ధర్మముల నెంతయాదరముతో శ్రీరామానుజులు తమదర్శనమున ప్రవేశ పెట్టిరో గాంచుడు.

## 14 ముక్తిఫల స్వరూపము.

దర్శనములన్నియును ముక్తిని సంపాదించు నుపాయములను తెలుపుటకే యేర్పడినవి. కాని ముక్తిస్వరూపమునందును దానికుపాయ స్వరూపమునందును ననేక భేదములుకలవు. అందులకు ప్రమాణము లును వేర్వేఱుగ స్వీకరింపబడినవి. ఇపుడు గీతలో చెప్పబడిన ముక్తి స్వరూపమున్ను దానిని రామానుజదర్శన మెట్లామోదించి ప్రవర్తించి

నదియు వివరించుచున్నాను. పిమ్మట ముక్త్యుపాయమును గూర్చి చర్చింతును.

క్షణిక విజ్ఞానవాదులు ఆత్మ క్షణిక విజ్ఞానస్వరూపమనియు, అది ప్రతిక్షణమునందును పుట్టుచు గిట్టుచు ప్రవాహమువలె సాగుచు నుండుననియు ఆత్మధారావిశ్రాంతియే మోక్షమనియు చెప్పుచుందురు.

జైనులు ప్రకృతిబంధమును వీడిన ఆత్మకు సతతోర్ధ్వగతియే మోక్షమందురు.

నైయాయికులు ఆగంతుక గుణ వినాశపూర్వకమగు పాషాణ ప్రాయస్థితియే మోక్షమందురు.

సాంఖ్య ప్రభృతులు కర్తృత్వాది రహితమైన శుద్ధ చైతన్య స్థితియే మోక్షమందురు.

కాని అమరకోశకారుడు 'ముక్తిర్మోక్షో మహానన్దః' అని మహానందమే మోక్షమనెను. ఆనందమునకు మహత్త్వమేమనగా దుఃఖగంధ రాహిత్యమే యందురు. ఈసంప్రదాయములలో గీత దేనినంగీకరించు చున్నదో చూదుడు—

పదునాల్గవ యధ్యాయమునందలి రెండవ శ్లోకమున

శ్లో॥ "ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః।
సర్గేఽపి నోపజాయన్తే ప్రలయేన వ్యథన్తి చ॥"

ముందు చెప్పబోవు జ్ఞానమును లభించినచో భగవత్సాయుజ్యమును బడసి యిక నెప్పుడును పుట్టరు గిట్టరు-అని సాధర్మ్యమను అనగా సాయుజ్యమునే మోక్షమని గీత నిర్వచించెను.

తొమ్మిదవ యధ్యాయమున చివటిశ్లోకమునందును. పద్దెనిమిదవ యధ్యాయమున అరువదియైదవ శ్లోకమునందును

శ్లో॥ "మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం
నమస్కురు, మామేవైష్యసి,"

అను నంతవఱకును పాఠభేదము లేకయే పెలవిచ్చి అపైన తొమ్మిదవ యధ్యాయములో "యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః" అనియును, నీ 18వ అధ్యాయమున 'సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే' అని యును పాఠభేదములతో శ్లోకములను ముగించెను. ఇందు గమనించ వలసిన ముఖ్యవిషయమేమన 'మామేవైష్యసి' అని ఫలమును జెప్పి ఏతత్సత్యం, తవ ప్రతిజ్ఞాం కరోమి, నోపచ్ఛందనమాత్రం, యత స్త్వం ప్రియోఽసి మే, యస్య మయ్యతిమాత్రో ప్రీతిర్వర్తతే మమాపి తస్మిన్నతిమాత్రా ప్రీతి ర్భవతీతి తద్వియోగ మసహమా నోహం తం మాం ప్రాపయామి. అతస్సత్యమేవ ప్రతిజ్ఞాతం 'మామేవైష్యసీతి'నన్నే పొందగలవు. ఇది సత్యము, నీకు నేనొట్టుపెట్టి చెప్పుచున్నాను. ఇచ్చకపు మాటలుకావు. నాయందు మిక్కిలిప్రీతి కలవానియందు నాకునుఅత్యంత ప్రీతి యుండునుగాన వాని యెడబాటును సహించక నేను వానిని నన్ను పొందించుచున్నాను. ఈ యుపపాదన వలన పరంబ్రహ్మ సాయుజ్యమే మోక్షమను గీతా సిద్ధాంతమే రామానుజ సిద్ధాంతము,

సూ : — "భోగమాత్ర సామ్యలిఙ్గాచ్చ" 4-4-21

అను బ్రహ్మసూత్రమున జీవునకు మోక్షదశలో లభించుపరమ పురుషసామ్యము భోగమునందు మాత్రమే. అంతియేగాని నిఖిలచేతన

స్వరూపస్థితి ప్రవృత్తులలో. మాత్రము భగవంతునితో సామ్యము చెప్పరాదని.

సూ:—"జగద్వ్యాపారవర్జం ప్రకరణాద సన్నిహితత్వాచ్చ"
4-4-17

అను సూత్రమున వివరింపబడినది.

ఉపనిషత్తులలోను:— 'బ్రహ్మవిదాప్నోతి పరమ్, అని బ్రహ్మ-విత్-ఆప్నోతి, పరం-అను నాలుగంశములను విచారించుచు ఆప్నోతిని విచారించుటలో—'సోఽశ్నుతే సర్వాన్కామాన్ సహబ్రహ్మణా విపశ్చితేతి' అని వివరించెను. అనగా ముక్తుడు పరమపదమున సర్వజ్ఞుడగు సర్వేశ్వరునితో పాటు అతని కల్యాణగుణములను సంతృప్తిగా ననుభవించునని చెప్పబడెను. ఇదియే ముక్తానుభవము. ఇదియే రామానుజ మతమున ముక్తిస్వరూపము.

రామానుజదర్శనము తన రక్షణభారమును భగవంతుని యందే యుంచిన ప్రపన్నుని సర్వపాపములను పరిహరించి పరమాత్మ తన స్థానమగు వైకుంఠమునకు చేర్చుకొనువిధాన మీక్రిందివిధముగ తెలుపుచున్నది.

శ్లో॥ సత్సఙ్గాద్భవ నిస్పృహో గురుముఖాత్ శ్రీశం ప్రపద్యాత్మవాన్
ప్రారబ్ధం పరిభుజ్య కర్మశకలం ప్రక్షీణ కర్మాంతరః
న్యాసా దేవ నిరఙ్కుశేశ్వర దయానిర్లూన మాయాన్వయో
హార్దానుగ్రహ లబ్ధమధ్యమని ద్వారా ద్వహిర్నిర్గతః॥

శ్లో॥ ముక్తోఽర్చిర్దిన పూర్వపక్ష షడుదఙ్మాసాబ్ద వాతాంశుమత్
గ్లౌవిద్యుద్వరుణేన్ద్ర ధాతృమహితః సీమాన్తసిన్ధ్వాప్లుతః
శ్రీవైకుణ్ఠముపేత్య నిత్యమజడం తస్మిన్పర బ్రహ్మణః
సాయుజ్యం సమవాప్య నన్దతి సమం తేనైవ ధన్యః పుమాన్॥

సాత్త్విక స్వభావ సంభాషణలచే సంసారమున విరక్తుడై పరమాత్మ యందు రక్తుడై సదాచార్య సమాశ్రయణము జేసి వారియుపదేశాను సారము శ్రియఃపతిని శరణాగతిజేసి లబ్ధసత్తాకుడై ఆగామి యంట కుండను సంచితము భస్మముగను నొనర్చి ప్రారబ్ధ శేషము ననుభ వించి తాకోసరించిన యుపాసనాతిశయముచే ప్రసన్నుడైన పర మాత్మచే ప్రకృతిసంబంధము విశేషముగా పరిహరింపబడగా అతని యనుగ్రహముచేతనే హృదయకుహరమున వెలుగొందు కాంతిపుంజముచే సుషుమ్నానాడీమార్గము నెఱింగి తద్ద్వారా బ్రహ్మరంధ్రమును భేదించు కొని బైటకువచ్చి సూర్యకిరణముల నాధారముగా జేసికొని అర్చి, దిన, శుక్లపక్ష, ఉత్తరాయణ, సంవత్సరాభిమాన దేవతలును, వాయు వును, మార్గదర్శకులుగా నుండు మార్గమున సూర్యమండలమున జేరి దానిని భేదించుకొని చంద్ర విద్యుత్ వరుణ ఇంద్ర చతుర్ముఖులనెడు అతివాహికులచే నాదరింపబడి బ్రహ్మాండకటాహమును భేదించుకొని ప్రకృత్యావరణమును దాటి విరజలో స్నానమొనరించి అవలిగట్టున భగవదాదేశముచే వేచియున్న అమానవుని కరస్పర్శచే సూక్ష్మశరీర మును బాసి, యప్రాకృత దివ్యమంగళ విగ్రహమునుబడసి, బ్రహ్మా లంకారముచే నలంకరింపబడి నిత్యసూరి పరిషద్వర్గముచే నారాధింప

బడి. వైకుంఠ ద్వారమున జయవిజయులను సేవించి దివ్యప్రాసాద
మున ప్రవేశించి అనంతగరుడాదులను సేవించి పరమపురుషుని దరిజేరి;
ఆతనిపాదముపై తనపాదమునుంచి పైకెక్కి ఆతనిఒడిలో కూర్చుండి;
నిత్యనిరతిశయానందము ననుభవించుచు తిరిగి రాకుండును. ఇదియే
గీతాసిద్ధాంతము. ఈవిషయము ఎనిమిదవ యధ్యాయమున ఇరువది
నాల్గవ శ్లోకము మొదలు ఇరువదియేడవ శ్లోకమువఱకును సంగ్రహ
ముగ సూచింపబడినది.

ఇందు నల్లమార్గము, తెల్లమార్గములని రెండుమార్గములు చెప్పబ
డినవి. నల్లమార్గమనగా ధూమాదిమార్గమనియు, తెల్లమార్గమనగా
అర్చిరాది మార్గమనియు, మొదటిది పునరావృత్తిని రెండవది యపునరా
వృత్తిని ప్రసాదించుననియు నందు దెలుపబడెను.

# మోక్షసాధనము.

## భక్తియోగము.

రామానుజ దర్శనము :—

ముక్తి యనగ మహానందము. ఇది సమస్త ప్రాణులాశించునదియే.
కాని దీని పరమావధి నెవ్వరును చేరలేకున్నారు.

శ్లో॥ "దివేవిపతి మానుషః స చ తిలద్విభూమత్యసా
శశిర్విపతి సర్వదా వివిధయిష్యతే తేన చ

ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే — ముముక్షిమతి తత్త్వగతార్థమాగతే స్వనిస్సంశయమ్
నివర్తిమతి సర్వథా స చ శిరంగభిక్షునామతే॥

అని పూర్వాచార్యుల శ్లోకముల వివరించిరి. మనుష్యుడు దేవత్వమును కోరును. దేవుడు ఇంద్రుడు కాగోరును. ఇంద్రుడు రుద్రుడు కాగోరును. రుద్రుడు సృష్టికర్తయగు చతుర్ముఖబ్రహ్మ కాగోరును. బ్రహ్మ ముక్తుడు కాగోరును. ముక్తుడు నిత్యుడు కాగోరును. నిత్యుడు శ్రీరంగనాథుని భిక్షుకుడు (రామానుజుడు) కాగోరును-అనునట్లే యానందాభిలాషకు పరమావధి మహానందమే-అనగా దుఃఖము లేశమైనను లేని యానందము. అది సంభవమా యనగా

శ్రుతి:-"న హ వై సశరీరస్య సతః ప్రియాప్రియయోరపహతిరస్తి
అశరీరం వా వసన్తం ప్రియాప్రియే న స్పృశతః॥

అనుచున్నది.

అనగా పాంచభౌతిక శరీరమున్నంతవరకు దుఃఖమిశ్రానందానుభవమే కలుగుచుండును. కాని యాశరీరము లేకుండ చేసికొన్నచో దుఃఖగంధములేని నిరతిశయానందము ననుభవింపవచ్చును. అట్లు శరీరమునకు నిరన్వయ వినాశమెట్లు ఘటించుననగా

శ్రుతి:-"భిద్యతే హృదయగ్రన్థిః ఛిద్యన్తే సర్వసంశయాః।
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥"

అనగా పరమాత్మయొక్క సాక్షాత్కారమును బడసినచో హృదయస్థ-జీవునియొక్క, గ్రన్థి-పీటముడివలె విప్పుటకు శక్యముగాని

శరీరసంబంధము, భిద్యతే-పటావంచలై పోవును- అవి చెప్పచున్నది
ఆపరమాత్మ దర్శనమెట్లు కలుగుననగా నాశ్రుతియే

"యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ంస్వామ్" అనగా ఆ పరమాత్మ ఎవనివి వరించుచున్నాడో వానికి తన యప్రాకృతస్వరూపమును జూపును. ఆ పరమాత్మ ఎవనిని వరించు ననగా-

"ప్రియాతమ ఏవ హి వరణీయో భవతి"

అయన కత్యంతప్రియు నాతడు వరించును. అట్లంత ప్రియతము డెవర నగా ఆతని నంతగా ప్రేమించువాడే.

'ప్రీతిపూర్వ మనుధ్యానం భక్తి రిత్యభిధీయతే'

అను ప్రమాణమునుబట్టి యిట్లు ప్రీతితో ధ్యానించుటయే భక్తి యనబడును. దీని సారాంశమేమనగా భక్తివలననే ముక్తిని బడయ వచ్చును. ఇది రామానుజ సిద్ధాంతము. దీనికి ప్రమాణము వారి శ్రీసూక్తియే.

గీతాభాష్యావతారికలో గీతలో ప్రధానముగా ప్రతిపాదింపబడు ముఖ్య మోక్షసాధనము నుపదేశించుచు "పరమ పురుషార్థ లక్షణ మోక్షసాధనతయా వేదాన్తోదితం స్వవిషయం జ్ఞానకర్మాను గృహీతం భక్తియోగ మవతారయామాస" అనగా పురుషార్థము లన్నిటిలో నుత్తమమగు మోక్షమునకు సాధనముగా వేదాన్తములలో చెప్పబడి నట్టియు,తనను గూర్చినట్టియు. జ్ఞానకర్మలనంగముగా కలిగియున్నట్టియు

భక్తియోగమును భగవద్గీతా శాస్త్రముద్వారా లోకమున నవతరింపజేసె నవి సెలవిచ్చిరి. గీతనంతను నీ భక్తియోగపరముగనే సమన్వయిం చిరి. దీనికి పూర్వాచార్యులగు ఆళవందారుల

శ్లో॥ స్వధర్మజ్ఞాన వైరాగ్య సాధ్య భక్త్యేకగోచరః
నారాయణః పరంబ్రహ్మ గీతాశాస్త్రే సమీరితః॥

గీతాశాస్త్ర సంగ్రహః

అను శ్లోకమే ప్రధాన ప్రమాణముగా గైకొనిరి. అనగా తనవర్ణాశ్రమ ధర్మములను పరమపురుషుని యారాధన యనుజ్ఞానముతో నాచరించిన వైరాగ్యము జనించును. దానిచే భక్తి యుదయించును. దానిచే నారాయణుని దర్శించి ముక్తి బడయవచ్చును.

## గీతా సిద్ధాంతము.

ముక్తికి సాధనము భక్తి. భక్తియనగా తైలధార వలె నవిచ్ఛిన్న ముగా పరమపురుషుని శాస్త్రనియమములతో ధ్యానించుట. ఇది పన్నెం డవయధ్యాయమున విధింపబడినది. దీనికి పరమాత్మయొక్క పరోక్ష జ్ఞాన మవసరము. అది 7, 8, 10, అధ్యాయములలో చెప్పబడి పద కొండవ అధ్యాయములో చూపబడినది. 10, 11 అధ్యాయములు ముఖ్య ముగా భక్తి పుట్టుటకును, వృద్ధిపొందుటకునే యుపదేశింపబడినవి. ఇట్టి భక్తికధికారి స్వాత్మ సాక్షాత్కారసమర్థుడగు నిష్కామకర్మయోగియే. అట్టి యాత్మ సాక్షాత్కారము ఆత్మధ్యానముచే ఘటించును. దానికాత్మ పరోక్షజ్ఞాన మవసరము. అదియే మునుముందుగా రెండవ యధ్యాయము

లో తెలుపబడినది. ఇట్లాత్మతత్త్వజ్ఞానపూర్వకమగు నాత్మసాక్షాత్కారముచే భక్తియోగాధికారమును సంపాదించుకొని గురూపదేశమూలముగా పరమాత్మ తత్త్వమునెఱింగి యాతని నుపాసించి సాక్షాత్కరించుకొని నచో ప్రాకృతశరీరసంబంధము వీడి యర్చిరాదిమార్గమున పరమపదము నధిరోహించి పరమపురుష సాయుజ్యమును బడసి యిక దిగిరాకయచ్చటనే నిరతిశయానందము ననుభవించును.

ఈవిషయము గీతలో రెండవ యధ్యాయ ప్రారంభమున ఆత్మ పరోక్షజ్ఞానము నుపదేశించి' నిష్కామకర్మయోగము నాచరించవలసిన విధానమును బోధించి దానివలన జ్ఞానవిష్ఠను స్థితప్రజ్ఞ యొక్క యవస్థాన భేదములతో వర్ణించి ఆరవయధ్యాయములో నట్టి యాత్మను సాక్షాత్కరించు కొనుటకు చేయవలసిన ధ్యానముయొక్క అంతర బాహ్య నియమములను పేర్కొని దానిచే నాత్మసాక్షాత్కారము బడయు క్రమము తెలుపబడెను. ఆరవయధ్యాయములో చివర "యోగినామపి సర్వేషాం" అనుశ్లోకములో "శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః" అని భక్తుని యుక్తతముడని ప్రశంసించి యాభక్తుని యాభక్తివిగూర్చి తెలిసికొనవలెనను జిజ్ఞాస నరునకు బుట్టించి యాపైన పన్నెండవ యధ్యాయము వరకు భక్తియోగమునుగూర్చి చెప్పవలసిన వాటి నన్నిటిని చెప్పెను. అందుముఖ్యముగా 6, 7 శ్లోకములలో "లౌకిక వైదికకర్మలన్నిటినినాయందు సమర్పించి నన్నే ముఖ్యప్రాప్యముగా తలంచి యితర ఫలములను కోరక నన్నే ఉపాసించుచు నాయందే మనస్సును నిలిపి ధ్యానించుచుండునట్టివారలను మృత్యుమయమగు సంసారమనెడు సము

దశ్రిమునుండి త్వరలో నుద్ధరింతునని భక్తికి ఫలము ముక్తియే యని
చెలవిచ్చెను.

యో మద్భక్త స్సమే ప్రియః (14 శ్లో)

నన్ను భజించువాడు నాకిష్టుడు.

హర్షామర్ష భయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః
(15 శ్లో)

సంతోషము, కోపము, భయము, మనోవ్యాకులత లేనట్టివాడు

యోమద్భక్తస్సమే ప్రియః (16 శ్లో)

నాకు ప్రియుడు

శాస్త్రవిరుద్ధకర్మలను విడిచి నన్నే భజించువాడు నాకిష్టుడు.

భక్తిమాన్ య స్స మే ప్రియః (17 శ్లో)

బంధహేతువులగు పుణ్యపాపములను విడిచి నన్ను భజించు
కర్మయోగి నాకు ప్రియుడు.

భక్తిమాన్ మే ప్రియో నరః (19 శ్లో)

నన్ను భజించువాడు నాకు ప్రియుడు.

భక్తాస్తేఽతీవ మే ప్రియాః (20 శ్లో)

భక్తులు నాకు మిక్కిలి ప్రియులు.

అని యిట్లారుశ్లోకములలో భక్తులను కొనియాడెను.

వృక్షమునకు ప్రాయశః సారము మధ్యయందున్నట్లు గీతకు
సారము మధ్యదియగు తొమ్మిదవ యధ్యాయమున గలదు. ఆ సారమే

భక్తి. అది యీయధ్యాయమున షడ్విధ తాత్పర్యలింగములతోను ప్రతిపాదింపబడుచున్నది గాంచుడు.

1. ఉపక్రమోపసంహారములు, 2. అభ్యాస. 3. అపూర్వతా 4. ఫలము, 5. అర్థవాద, 6. ఉపపత్తులనునవి, తాత్పర్యనిర్ణాయకమగు లింగములు.

9వ అధ్యాయారంభమున—

గుహ్యతమం వక్ష్యామి- అది జ్ఞానవిజ్ఞానములతో కూడుకొని యున్నది. దాని నెఱుంగుటకు ఫలము మోక్షమే యని కలదు.

మోక్షోపాయములలో అన్నిటికంటె దూరతమమైనది కర్మ యోగము. కాన నది గుహ్యము. భక్తికంటె దూరతరమైనది గాన జ్ఞానయోగము గుహ్యతరము. అత్యంతసన్నిహితమైనది గాన భక్తి యోగము గుహ్యతమము, కావున గుహ్యతమమును అనగా భక్తి యోగమును చెప్పెదనని యర్థము. భక్తియోగమును గుహ్యతమ మనుటకు ప్రమాణము 18వ అధ్యాయమందలి 64 వ శ్లోకమున "సర్వ గుహ్యతమం భూయః శృణు మే పరమం వచః" అన్నిరహస్యములలోను రహస్యతమమైన ఉత్తమవాక్యమును చెప్పెదను వినుమని హెచ్చరించి, - 65వ శ్లోకమున ''మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు" నన్నవారతమును ప్రీతితో ధ్యానింపుము. నాయందు భక్తికలవాడవుకమ్ము - నన్ను ప్రీతితో నారాధింపుము. భక్తితో నాకు నమస్కరింపుమని సాంగ భక్తియోగము నుపదేశించెను. కాన గుహ్యతమ మీ భక్తియోగమే.

జ్ఞాన విజ్ఞానము లనగా - ఈ పదములు గీతలో మూడుసారులు వాడబడినను ప్రకరణానుసార మర్థభేదము నంగీకరించవలెను. భోజన ప్రకరణమున వాడబడిన సైంధవశబ్దమునకు గుఱ్ఱమనియు ప్రయాణ ప్రకరణమున వాడబడిన నదే శబ్దమునకు ఉప్పనియు నర్థమును చెప్పు చెనటియుండునా?

కావున నిట జ్ఞానమనగా - ఉపాసన (ధ్యాన) మనియు, విజ్ఞాన మనగా ధ్యాన ప్రకారమనియు నర్థముగాన నిదియును భక్తిపరమే.

దానికి ఫలము మోక్షమనుటయును భక్తియోగమునే బలపరచు చున్నది. గుహ్యమగు కర్మయోగమునకు ఫలము జ్ఞానయోగము,గుహ్య తరమగు జ్ఞానయోగమునకు ఫలము భక్తియోగము, గుహ్యతమగు భక్తియోగమునకు ఫలము ముక్తియేగదా!

ఈ గుహ్యతమోపదేశమును వినుట కర్జునున కధికారమును సూచించుచు 'అనసూయవే ప్రవక్ష్యామి' యనెను. ఇదియును భక్తియో గమునే బలపరచుచున్నది. భక్తియోగమనగా ప్రీతితో ధ్యానించుట. ఆ ప్రీతియు నభిమత కల్యాణగుణములున్ననే పుట్టి పెరుగును. కావున భక్తిపుట్టి వృద్ధిపొందుటకు తన కల్యాణగుణములను తెలుపవలెను. అసూయపరున కాగుణములను తెలిపిన "పయః పానం భుజఙ్గానా" మన్నట్లు పామునకు పాలుపోసినట్లే. అసూయ యనగా కోశకారుడు "దోషారోపో గుణేష్వపి" యని చెప్పియున్నాడు. నీవట్టి యసూయ లేనివాడవు గాన నేజెప్పెడు నాగుణములలో దోషముల నారోపించవు

గాన చెప్పెదను. విని గ్రహించి ధ్యానించి ముక్తుడ నగుదువని తాత్పర్యము నీయనసూయవే యను పదము సూచించుచున్నది

ఇక ఈ అధ్యాయ ఉపసంహారమున—

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః"

అని భక్తియోగమునే సాంగముగను సఫలముగను నుపదేశించెను.

ఈ భక్తినే- 13, 14, 15, 22, 26, 30, 31, 33 శ్లోకములలో సాక్షాద్భక్తిశబ్దమును, దానికి పర్యాయమగు ఉపాసనాశబ్దమును ప్రయోగించి యభ్యాసలింగమును జూపించెను.

ఈ భక్తికి ఇతరత్ర తెలియబడని ప్రత్యక్షరూపత్వమును, నిరతిశయప్రియత్వమును- కీర్తన, యతన, నమస్కారరూపత్వములను భక్తిస్వరూపాంతర్గతములనుగా జెప్పుటచే అపూర్వత్వము కలదు.

"సుసుఖం కర్తుం" అనుటచే స్వరూపము నుదిష్టియును.

మోక్ష్యసేఽశుభాత్ — సంసారము నుండి విముక్తుడ వగుదువనియు,

"యోగక్షేమం వహామ్యహమ్" వారికి లేనివాటినిచ్చి యిచ్చిన వాటిని కాపాడెదననియును,

విముక్తో మా ముపైష్యసి = కర్మబంధములనుండి విడువబడి నన్ను పొందగలవనియు.

న మే భక్తః ప్రణశ్యతి = నాభక్తుడెన్నడు నశింపడనియును.

మామే వైష్యసి యుక్త్వైవం = ఇట్లున్నచో నన్నే పొందుదువనియు ఫలమును దెలిపి ఫలమనెడు తాత్పర్యలింగమును దెలిపెను.

రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిద ముత్తమమ్ !
ప్రత్యక్షావ గమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్॥

ఈ భక్తియోగము విద్యలకు రాజు, రహస్యములకు రాజు, అన్నిటికంటెను గొప్పది, నన్ను పొందుట కాటంకములగు పాపములను పోగొట్టునది. నన్ను ప్రత్యక్షముగా జూపునది, ధర్మమును తప్పనిది. మిక్కిలి ప్రియముగా పరిగ్రహించదగినది, ఫలమునిచ్చియు నశించనిదని యిట్లు ఎనిమిది విశేషణములతో నీభక్తియోగమును పొగడి యర్థవాదమును జూపెను.

4. 5. 6. 7. 8. 9. 10. 16. 17. 18. 19. 24. 32శ్లోకములలో తనకు గల అనితరసాధారణమైన మహిమను జెప్పి అందుచే తానే పరమపురుషార్థప్రదుడనని యుపపత్తిని దెలుపుటచేతను పైనుదహరించిన తాత్పర్యలింగము లారును భక్తియోగమునే యీయధ్యాయసారముగ నిరూపించుచున్నవి.

మరియొక ముఖ్యాంశమీయధ్యాయమున బొరగట్టుచున్నది. ఉ
త్పత్తికిని వృద్ధియగుటకును కారణము పరస్పరసంబంధ జ్ఞానము
ఆ సంబంధము చేతనుల కీశ్వరునితో తొమ్మిదివిధములుగ నుండును.
అవి —

| | | |
|---|---|---|
| 1. పితాపుత్రసంబంధము | పితాహమస్య జగతః | 17 శ్లో |
| 2. రక్ష్య— రక్షకభావము | నివాసశ్శరణం సుహృత్ | 18 శ్లో |
| 3. శేష—శేషిభావము | మాతాధాతా పితామహః | 17 శ్లో |
| 4. భార్యా-భర్తృ భావము | గతిర్భర్తా | 18 శ్లో |
| 5. జ్ఞాతృ—జ్ఞేయభావము | వేద్యం పవిత్ర మోజ్కార | 17 శ్లో |
| 6. స్వ-స్వామిభావము | గతిర్భర్తా ప్రభుః | 18 శ్లో |
| 7. ఆధా రాధేయభావము | నిధానం బీజమవ్యయమ్ | 18 శ్లో |
| 8. శరీరాత్మభావము | సదసచ్చాహ మర్జున | 19 శ్లో |
| 9. భోక్తృ భోగ్యభావము | భోక్తా చ ప్రభు రేవ చ | 24 శ్లో |

ఈ తొమ్మిది సంబంధములను 8 శ్లోకములతో జెప్పివేసెను.
ఇంకను విశ్వరూప సందర్శనాధ్యాయమున—

నాహం వేదై ర్న తపసా, న దానేన న చేజ్యయా।
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్ట వానసి మాం యథా।
భక్త్యా త్వనన్యయా శక్యః అహ మేవంవిధోఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన, ప్రవేష్టుం చ పరంతప॥

అనగా - అర్జునా! నీవిప్పుడు చూచినట్లు నావాస్తవస్వరూపము నాయందు భక్తిలేని కేవలం వేదాధ్యయనాదులచేతగాని, తపస్సులచేత గాని, దానముచేతగాని, యాగాదులచేతగాని చూచుటకు సాధ్యముకాదు.

ఇతరఫలములను కోరక భక్తిచేతనే నా వాస్తవరూపమును శాస్త్రములచే తెలియుటకును, ఉన్నదున్నట్లు జూచుటకును పరిపూర్ణ ముగా ననుభవించుటకును సాధ్యమగునని కంఠరవముతో భక్తియే ముక్తికి సాధనమని నిర్ధారణ గావించెను.

ఇట్టి భక్తికి సాధనము లేడుగలవు. అవి—

వివేక-విమోక- అభ్యాస- క్రియా- కల్యాణ- అనవసాద- అనుద్ధర్ష లనునవి—

వివేకమనగా - జాతి దుష్టములు, ఆశ్రయదుష్టములు, నిమిత్తదుష్టములును గాని పదార్థములను తిని శరీరమును శుద్ధముగా పోషించుకొనుట

విమోకమనను- కామములకు వశుడు గాకుండుట

అభ్యాసమనగా- ధ్యేయవస్తువు మనస్సును విడువకుండునటుల నిరంతరధ్యానము నలవరచుకొనుట.

క్రియయనగా - శక్తికొలది పంచమహాయజ్ఞములను జేయుట.

కల్యాణమనగా-సత్యము, ఆర్జవము, దయ, దానము, అహింస, పరులసొత్తున కాశపడకుండుట యనునవి.

అనవసాదనముగా - దేశకాలవస్తువులు తనకు ప్రతికూలముగా నున్నవని కృంగిపోకుండుట.

అనుద్ధర్షమనగా—అవి తనకనుకూలముగా నున్నవని పొంగిపోకుండుట

తన కధికారము లేకుండుటచేగాని తనకు శక్తి లేకుండుటచేగాని వీని నవలంబించి భక్తియోగమును సాధించి తద్ద్వారా ముక్తిని బడయ జాలనివారికి ప్రపత్తియే శరణ్యమని కొందరును, మరికొందరు జీవుడు పరతంత్రుడు, ఈతనికి స్వాతంత్ర్యము సుతరాం గిట్టదు. అట్టివాని కితరసాధనము లన్నియును స్వరూపవిరుద్ధములు, కాబట్టి వాటినెల్ల విడచి ప్రపత్తి నొక్కదానినే యవలంబించవలెనని సెలవిత్తురు. భక్తి తన ప్రయత్నసాధ్యముగాన విలంబనసహము. ప్రపత్తి సర్వధర్మ పరిత్యాగపూర్వక భగవదుపాయ పరిగ్రహముగాన శీఘ్ర ఫలప్రదము, స్వరూపానురూపము నగుచున్నది. భక్తికి దేశ-కాల-ప్రకారాది నియమములున్నవి. కాని ప్రపత్తి కవి లేవు.

న జాతి భేదం న కులం న లిఙ్గం న గుణక్రియాః ।
న దేశ కాలౌ నావస్థాం యోగో హ్యయ మపేక్షతే ॥
బ్రహ్మక్షత్రవిశః శూద్రాః స్త్రియశ్చాన్తర జాతయః
సర్వ ఏవ ప్రపద్యేరన్ సర్వధాతార మచ్యుతమ్ ॥

దీనికి బ్రాహ్మణ్యాది జాతిభేదముగాని, త్ర్యార్షేయ పఞ్చార్షేయాది కులభేదముగాని, బ్రహ్మచర్యాది ఆశ్రమభేదముగాని, శమాది గుణభేదముగాని, జాతపుత్రత్వాది వయోవిశేష నియమములుగాని లేవు బ్రాహ్మణ్యాది నాలుగువర్ణములవారును, స్త్రీలును సంకరజాతులవారును, అందరును అన్నివేళలయందును అన్నిఫలములకును శ్రియఃపతిని ప్రపత్తి చేయవచ్చును.

ప్రథమాధ్యాయ చతుర్థపాదమునందలి ఆనుమానికాధికరణమున భాష్యకారులు 'ఇన్ద్రియేభ్యః పరాహ్యర్థాః, ఇత్యాది శ్రుతివాక్యమును వివరించుచు 'శరీరాదిషు యాని యేభ్యో వశీకార్యతాయాం ప్రధానాని తాన్యుచ్యన్తే'యని యవతారిక ననుగ్రహించి చివరకు 'పురుషాన్న పరం కిఞ్చిత్సాకాష్ఠా సా పరాగతిః' యను వాక్యశేషమునువివరించుచు 'వశీకార్యోపాసన నిర్వృత్త్యుపాయ కాష్ఠాభూతఃపరమప్రాప్యశ్చ స ఏవ' అని సాయించి 'తస్య వశీకరణం తచ్ఛరణాగతిరేవ' అని ముగించిరి.

జ్ఞానవిరోధులగు నింద్రియ విషయాదులలో దేనికంటె నేది ప్రబలమైనది? దానిని జయించి స్వాధీనపరచుకొనుటెట్లు? అని విచారించి వానిలో చరమావధి శ్రియఃపతియే యనియు నాతనిని వశీకరించుకొనుటకు దారి యాతని శరణాగతి తప్ప వేరొక్కటి లేదనియును ముగించిరి.

వేదార్థసంగ్రహమున ప్రపత్తి లేక మోక్షము సిద్ధించ దనుటలో ప్రమాణములను జూపుచు గీతయందలి 7వ అధ్యాయములోని

“మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే”

యను 14 వ శ్లోకమును ప్రమాణీకరించి—

“తస్యై తస్యాత్మనః కర్మకృత విచిత్రగుణమయ ప్రకృతి సంసర్గరూపాత్ సంసారాన్మోక్షః భగవత్ప్రపత్తి మన్తరేణ నోపపద్యతేఇత్యుక్తం భవతి” అనగా ఈయాత్మకు కర్మచే దాపరించిన సత్వ రజస్తమోగుణాత్మకమగు ప్రకృతిబంధమనెడు సంసారమునుండివిముక్తి

భగవంతునికి ప్రపత్తి చేయుటకంటె వేరొండుపాయముచే సిద్ధింపదని తెలిపిచ్చిరి.

ఈప్రపత్తియు భగవద్గీత నాపాదచూడము షడ్విధతాత్పర్య లింగములతో విమర్శింప సారతమముగా తేలును.

గీతాశాస్త్రమునకు ప్రారంభము ద్వితీయాధ్యాయమందలి "నత్వే వాహ"మ్మనెడు 12వ శ్లోకము.ఆశ్లోకముదయించుటకు ముఖ్యకారణము 'కార్పణ్య దోషోపహత స్వభావః' అనెడు 7 వ శ్లోకము. అందు "శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నం"నేను నీకు శిష్యడను. నిన్ను శరణజొచ్చిన అజ్ఞాపింపుమనిశరణాగతి గావ్పించుచున్నదిగదా?

ఉపదేశావసానమునను స్వరూపవిరుద్ధమగు కర్మజ్ఞానభక్త్యాది ఉపాయాంతరమునెల్ల విని విని భయపడి దుఃఖించు నర్జునునకో శ్రీకృష్ణుడు సర్వగుహ్యతమమును వినుమని హెచ్చరించి "మామేకం శరణం వ్రజ— నన్నేదిక్కని నమ్మియుండుమని యాదేశించుటచే నవ సానమునందును శరణాగతినే యుపదేశించెను.కాన ఉపక్రమోపసంహా రాత్మకలింగము ప్రపత్తినేసమర్థించుచున్నది. "మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే" యను 7 వఅధ్యాయమునందలి 14 వ శ్లోకమునందును,

"తమేవ చాద్యం పురుషం ప్రపద్యే" అనెడు 15 వ అధ్యామునందలి 4 శ్లోకమునందును, 18 వ అధ్యాయమునందలి 'తమేవం శరణం గచ్ఛ సర్వభావేన భారత' అనెడు 62 వ. శ్లోకమునను, ఈశరణాగతికి యభ్యాసము గలదు. అన్నిటిని విని విని షేమియును చేయుటాత్మ

దుఃఖించు నర్జునునకు "సర్వగుహ్య తమం భూయః శృణు మే పరమం వచః" యని యాప్రపత్తి నుపదేశించుటచే దీనికపూర్వత సిద్ధించు చున్నది.

'మా మేవ యే' యను 7 వ అధ్యాయమందలి 14 శ్లోకముచే ప్రపత్తికి ఫలము "మాయా మేతాం తరన్తి తే" యని సంసారతరణమే యనియును,

సంసార నిర్మూలనోపాయము అసంగశస్త్రమనియు దానిని బడయుట కాపరమపురుషుని శరణవరణ మొక్కటియే యుపాయమనియును 'తమేవ చాద్యం పురుషం ప్రపద్యే' అనిసెలవిచ్చెను.

'తమేవం శరణం గచ్ఛ సర్వభావేన భారత! తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్యసి శాశ్వతమ్' అనెడు 18 వ యధ్యాయముమందలి 62వశ్లోకమున శరణాగతికి ఫలము ఉత్తమమైన శాంతియు, నిత్యమైన పరమపదస్థాన మనియును ఆనతిచ్చెను.

చివరకు 18 వ అధ్యాయమందలి 66 శ్లోకమున—

"అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి"

అని మోక్షమునకుప్రతిబంధక సకలపాపప్రమోక్షమే శరణాగతికి ఫలమనియును తెలిపి ఫలమ నెడు లింగమును జూపెను,

ఈప్రపత్తి నుపదేశించుటకు పూర్వము

"సర్వగుహ్యతమం భూయ శృణు మే పరమం వచః

అన్ని రహస్యములలోను రహస్యతమమైన వాక్యమును చెప్పెద వినుమని హెచ్చరించి యుపదేశించిన పిమ్మట

"ఇదం తే నాతపస్కాయ। నాభక్తాయ కదాచన।
న చా శుశ్రూషవే వాచ్యం। న చ మాం యోఽభ్య
సూయతి"

అనగా-నేను నీకుపదేశించిన ఈపరమరహస్యమును తపోరహితునకును, భక్తి లేనివానికిని, గురుశుశ్రూష చేయనివానికిని, నన్ను గూర్చి యసూయపడువానికిని యెంతమాత్రమును చెప్పరాదని యాంక్షనిండుటచే దీని ప్రశంస ప్రసిద్ధమగుచున్నది.

ఇక ప్రపత్త్యుపదేశ స్థలము లన్నిటిలోను నా శరణు జొచ్చినవాడీప్రకృతిబంధమునుండి విముక్తుడగుటకు కారణము "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా" సత్వరజ స్తమోగుణాత్మకమైన ప్రకృతి క్రీడాప్రియుడనగు నాచే క్రీడార్థమై నిర్మింబడెను, కావున నన్నేదిక్కని నమ్మియుండువానికి దీనిని తొలగింతుననియు,

'తమేవ చాద్యం పురుషం ప్రపద్యేత్'

ఆ యాదిపురుషుని ప్రపత్తి చేసినచో-

'యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ'

పురాతనమై గుణమయ భోగసంగాత్మకమైన సృష్టిరూప ప్రవృత్తి యాతనివలననే కలిగినది గాన యాతని యనుగ్రహముచేతనే నిర్మూలమగుననియు,

ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥

దేహేంద్రియాదిరూపమగు ప్రకృతి యంత్రమును నధిష్ఠించియున్న సమస్త ప్రాణులను సత్వగుణమైన తనప్రకృతిచేత ప్రవర్తింపజేయుచు సమస్త ప్రాణులయొక్క హృదయప్రదేశమున స్థిరముగ నాభగవంతు డున్నాడు గాన,

'తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,

ఆతనిని శరణు పొందుము. ఆయన యనుగ్రహమువలన ఉత్తమశాంతిని నిత్యమైన పరమపదమును బడయగలుగుదువనియు నిట్లుపపత్తులను జూపెను.

ఇట్లు షడ్విధ తాత్పర్యలింగములచే భక్తినివలెనే ప్రపత్తి గూడ గీతలో ప్రధాన ప్రతిపాద్యముగా పెలవిచ్చెను. గావ నిది ప్రధానమైన మోక్షసాధనమునుట నిర్వివాదాంశము.

మరియొక ముఖ్యవిషయమును పరికింపుడు

18 వ యధ్యాయమునందలి 63 వ శ్లోకమువరకు నుపదేశించిన ఉపాయము లన్నియును గుహ్యతరములనియు, వాని నన్నిటిని సమగ్రముగా విమర్శించి తోచినట్లు చేయుమని చెప్పగా విని దుఃఖించుచున్న యర్జునునికి 'సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః' యని గుహ్యతమముగా నుపదేశించి యోదార్చిన దీప్రపత్తి మార్గమే, దీనిని వినిన పిమ్మటనే యర్జునుడు—

"నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత!
స్థితోఽస్మి గత సందేహః కరిష్యే వచనం తవ"

అనగా కృష్ణా! నీయనుగ్రహమువలన నా మోహము నశించినది. తత్వజ్ఞాన ముదయించినది. సందేహములు పోయినవి. స్థిరబుద్ధి కలిగినది. నీవు చెప్పినటుల చేసెదనని సంసిద్ధుడయ్యెను.

ఇట్లు భక్తిప్రపత్తులు రెండును సన్నిహిత మోక్షోపాయములు గనుకనే "భక్తిప్రపత్తిభ్యాం ప్రసన్న స్సఏవ మోక్షోపాయః" యని పెద్దలు భక్తిప్రపత్తులచే ప్రసన్నుడైన శ్రియఃపతి మోక్షమును ప్రసాదించునని సెలవిచ్చిరి.

## 17. అవతార రహస్యమొక మోక్షోపాయము

రామానుజదర్శనమున అవతార రహస్యమొక మోక్షోపాయముగా నిర్ణయింపబడెను. చరమశ్లోక వ్యాఖ్యానమున—

"సర్వధర్మాన్ పరిత్యజ్య" యను ప్రథమచరణ వ్యాఖ్యానము నొనరించుచు నితరధర్మముల నన్నిటియొక్క పరిత్యాగ మిదివరలోనే యుపదేశింపబడెను. ఇప్పుడు విడువుమని యుపదేశించుధర్మములు మోక్షసాధనములు, అందు 'సర్వ' పదముచే తెలుసుకొనదగిన పరిత్యాజ్య మోక్ష ధర్మములను గణించుచు అవతార రహస్యముకూడ సద్ధర్మములలో నొక్కటియని తెలిపిరి. ప్రపత్త్యపేక్షయా దానికి పరిత్యాగ మేర్పడినను భక్తి మొదలగు ధర్మములవంటిదనుట నిర్వివాదమేగదా. ఈవిషయమును గీత యెట్లు సమర్థించుచున్నదో గమనింపుడు.

భగవానుడు నాల్గవ అధ్యాయమున 5వ శ్లోకము మొదలు నాల్గు శ్లోకములలో తన యవతార రహస్యములనెల్ల నర్జునుని ప్రశ్నలకు సమాధానముగా నుపదేశించి చివర కీయవతార రహస్య విజ్ఞాన మొక మోక్షసాధనమని 9వ శ్లోకమున నుపదేశించెను.

జన్మ కర్మ చ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున॥

నా యవతార-చేష్టారహస్యముల నెఱింగినవాడు వర్తమానదేహ సంబంధమును వీడి తిరిగి జన్మించకుండుటయేగాక నా సాయుజ్యమును బడయునని పెలవిచ్చెను.

దీనివలన భగవదవతార రహస్యజ్ఞాన మొక మోక్షసాధనమని ఋజువగుచున్నది.

## 18. సదాచార సమాశ్రయణము కర్తవ్యము.

ఉపనిషత్తు లుద్ఘోషించు సదాచార్య సమాశ్రయణమును ఈ దర్శన మెంతగనో యాదరించుచున్నది.

ఆచార్యవాన్ పురుషో వేద. తస్య తావ దేవ చిరం
యావన్న విమోక్ష్యే...

సదాచార్యుల నాశ్రయించిన పురుషుడే తత్వార్థముల నెఱుంగ గల్గును. ఆతనికి మోక్షప్రాప్తికి, ప్రారబ్ధ కర్మావసానమే విలంబము. అని ఛాందోగ్యమున్ను

'తద్విజ్ఞానార్థం స గురుమేవాభి గచ్ఛేత్'

అను శ్రుతి తత్వజ్ఞానమునకు సదాచార్యసమాశ్రయణమును విధించుచున్నది.

"ఆచార్యా ద్దేవ విద్యా విదితా సాధిష్ఠం ప్రాపత్"

ఆచార్యసమాశ్రయణ మొనరించి తన్ముఖతః లభించిన విద్యయే సార్థకమగును. ఇట్లాచార్యసమాశ్రయణము వేదవిహిత మైనది.

దీనికే రామానుజులు తమ దర్శనమున ప్రాధాన్య మొసంగిరి.

శ్లో॥ శ్రీమద్భాగవతార్చనం భగవతః పూజావిధే రుత్తమం।
శ్రీవిష్ణో రవమాననా ద్గురుతరం శ్రీవైష్ణవోల్లఙ్ఘనమ్ ।
తీర్థా దచ్యుతపాదజా ద్గురుతరం తీర్థం తదీయాఙ్ఘ్రిజం ।
తస్మాన్నిత్యమతన్ద్రితో భవ సతాం తేషాం సమారాధనే॥

భగవంతుని పూజించుటకంటెను భాగవతులను పూజించుట ఉత్తమము.

భగవంతుని దూరుటకంటెను ఘోర మైన పాపావహము భాగవత దూషణము.

భగవచ్ఛ్రీపాదతీర్థముకంటెను పవిత్ర మైనది భాగవత శ్రీపాద తీర్థము.

కావున వారి నారాధించుటలో నేమరరాదు అని భాగవత వైభవము నుపదేశించిరి.

ఒకతరి వీరు ధనుర్దాసుతో—

ఇత్యేవం పూర్వగురవః ప్రాప్తా యది పరం పదమ్ ।
తేషాం శిష్యా గమిష్యన్తి కృపయా నాత్ర సంశయః ॥

పూర్వాచార్యులు పరమపదము నధిరోహించినచో వారి శిష్యులందరును వారి యనుగ్రహమువలన ముక్తిని బడయుటలో సందేహము లేదని సెలవిచ్చిరి.

ఈసిద్ధాంతమును గీతాచార్యు లెట్లు సమర్థించిరో గాంచుడు.

4వ అధ్యాయమందలి—

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥

అను 34వ శ్లోకమున- నేను చెప్పిన ఆత్మస్వరూపమును సాక్షాత్కరింపజేసికొనిన జ్ఞానులు నీకు చక్కగ నుపదేశింతురు. కావున నీవు వారికి సాష్టాంగనమస్కార మాచరించి శుశ్రూషగావించి యడిగి తెలిసికొనుమని యాదేశించెను.

"యస్య ప్రసాదకలయా కవయోఽపి తే తే
శాస్త్రాణ్యశాసు రిహా తన్మహిమాశ్రితాని॥"

యనునటుల నాభగవానుని యనుగ్రహలేశమునకు పాత్రులైన మహాకవు లాతని మహిమను బోధించు శాస్త్రముల నెన్నిటినో రచించిరి. అట్టిభగవాను డిష్ట దర్జునునకాచార్యుడై యజ్ఞాత జ్ఞాపన మొన

రించుచుండ వతనికి నేమికొఱత? అయినను చూడువాత దెట్లర్థునున కాదేశించుచున్నాడో.

దీనివలన నాచార్య సమాశ్రయణము భగవానున కెంతయో యభిమతమని గ్రహింపవలెను.

## 19. సదాచారమే ప్రబల ప్రమాణము.

అథ యది తే కర్మ విచికిత్సా వా వృత్త విచికిత్సా వా స్యాత్
యే తత్ర బ్రాహ్మణా స్సమ్మర్శినః.. యథా తే తత్రవర్తేరన్
తథా తత్రవర్తేథాః ॥

అనగా-గృహస్థాశ్రమమున ప్రవిష్టుడవై నీవాచరించు కర్మంలో గాని నడతలోగాని సంశయ ముదయించినచో నచ్చటనున్న సదాచార సంపన్నులగు సద్బ్రాహ్మణు లాకర్మలవట్ల ఎట్లువర్తింతురో చూచి నీవు నట్లే ప్రవర్తింపుమని శ్రుతియు.

"మహాజనో యేన గత స్స పన్థాః"

పెద్దలు పోవునదియే మనకు దారి యని యితిహాసమును "ధర్మజ్ఞ సమయః ప్రమాణం వేదాశ్చ"

వేదములకంటెను మునుముందు పెద్దల యాచారమునే ప్రమాణముగా గొనవలెనని యావస్తంభస్మృతియు నుద్ఘోషించుచున్నవి.

రామానుజ దర్శనమందును—

ధనుర్మాస వ్రతాచరణమున కేమిప్రమాణమని శంకించి 'హోళా ధికరణన్యాయమే దీనికి ప్రమాణమని నిర్ణయించిరి. అనగా పెద్దల యాచారమే ప్రబలప్రమాణమని దానికర్థము.

ఈవిషయమును అండాళ్ళతల్లి తిరుప్పావై ప్రబంధమున

"మేలై యార్ శెయ్‌వనగళ్" పెద్దలాచరించినవానినే మే మాచరింతుమని పాయించిరి.

రామానుజుల కీ తిరుప్పావై ముఖ్యప్రమాణము. కావుననే వీరికి తిరుప్పావై జీయరని ప్రసిద్ధనామము.

ఈసిద్ధాంతమును గీత యెట్లు సమర్థించుచున్నదో చూతుము- 3వ అధ్యాయమున—

శ్లో॥ "యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥"

(గీత 3 వ అధ్యాయము 21 వ శ్లోకము)

గొప్పవాడుగా నెన్నబడువాడు ఏకర్మ నెట్టి యంగములతో నా చరించునో దానినిచూచి లోకమును సామాన్యుడుకూడా ఆయంగముల తో నే యాచరించును. తెలవిచ్చెను

# 20. సదాచార్యప్రాప్తికి మదత్రయపరిత్యాగము ముఖ్యావసరము.

"ముముక్షువున కాత్మగుణములగు శమాదిత్యాదు లత్యంతావశ్య కములు. వానిలోను శమాదమాదులు ప్రధానములు. ఇవియున్ననే సదా

చార్యప్రాప్తియు, ఆతనిమూలమున మంత్రావాప్తియు, దానంజేసి సర్వేశ్వరుడును, ఆతనిమూలమున పరమపదమును సిద్ధించును" అని శ్రీవచనభూషణమందలి ప్రథమ ప్రకరణములోని 97 వ సూత్రమున తెలుపబడెను.

ద్వితీయప్రకరణమందలి 243 వ సూత్రమున ప్రపన్నుని దినచర్యను జెప్పుచు అహంకారము, అర్థము కామము అనునీమూడును అనుకూలురపట్ల అనాదరమును, ప్రతికూలురపట్ల ప్రీతిని ఉపేక్షించు వారి పట్ల అపేక్షను కలుగజేయును. కావున నీమూడును సత్వరస్వరూపనాశకములని తెలిసికొని వానినిసదాచార్యానుగ్రహముచే పరిహరించుకొనవలెనని తెలుపబడెను.

ఈవిషయమే భగద్రామానుజ చరిత్రలో చక్కని యొక్క ఘట్టముతో నిరూపింపబడెను.

శ్రీరామానుజుల్లు స్నానమొనరించి ధనుర్దాను చేతి నూతగాగొని తిరిగి వేంచేయుచుండుట వారిశిష్యులకు కంటకముగా దోచెను. వారి శంకను గ్రహించి పరిహరించుటకై శ్రీభాష్యకారులు—

"విద్యామదో ధనమద స్తృతీయోఽభిజనో మదః ।
ఏతే మదా మదాన్ధానాం త ఏవ హి సతాం దమాః ॥
అర్థః షాణి ర్నృహీతోఽస్య మర్యాదా స్థాత్వేన వైష్ణవాః॥"

విద్యావంతుడ నగుదు గర్వము, ధనవంతుడ నను అభిమానము, గొప్పవంశములో బుట్టితినను అహంకారము- అను నీ మూడుమదములును మిక్కిలి క్రూరమైనవి ఇవి యీ ధనుర్దాసునకు లేవు కావున

నాతడు పూతురు. అందువలననే నేను సాన్న మోనరించియు నాతని చేతి నూతగొని వచ్చుచున్నానని చెప్పిరి.

మరియు పండితాగ్రగణ్యులయ్యును విద్యాధనాభిజనమదములతో నిండియున్న దాశరథులు రామానుజులను తమకు చరమశ్లోకార్థము నుపదేశింపుడని ప్రార్థింప వారీతనికి మదత్రయముండగా నుపదేశింప రాదని శ్రీగోష్ఠీపూర్ణులవద్ద కనిపిరి. వారు వీరి స్థితిగ్రహించి, నీకున్న మూడుమదములను సమూలముగా విడిచి రామానుజులను శరణు జొచ్చుము. వారే నీకు దాని నుపదేశింతురని యాదేశించిరి. దానిని శిరసాగొని వీరు రామానుజుల సన్నిధికేగగా వారు దాశరథులను మహాపూర్ణుల కుమార్తెతో సామె యత్తవారింటికి వంటచేయుటకై పంపిరి. కొంతకాల మా కైంకర్యమును శ్రద్ధగాచేయగా వారామదత్రయవిముక్తుని రామానుజులవద్దకే తెలచిరి. రామానుజులు—.

"తమవేక్ష్య మహాత్మానం! వినిర్ముక్త-మదత్రయమ్ ।
సహసా చరమం శ్లోకం తస్మై శిష్యాయ సాదరమ్ ॥"

దాశరథులను మదత్రయ మూరుకమగా నెఱింగి వెంటనే చరమశ్లోకార్థము నుపదేశించిరి.

ఈవిషయమే గీతలో 3 వఅధ్యాయమున భగవానుడర్జునునితో-

"కామ ఏషః క్రోధ ఏషః రజోగుణసముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్॥"

రజోగుణమువలన బుట్టెడు విషయముల నెంతయనుభవించి నను శాంతించని కామమున్ను, అది ముదిరినచో పరిణమించు పాపాకరమగు క్రోధమున్ను, సన్నిహితశత్రువులు. కావున వానిని జయించుట మానవుని ముఖ్యకర్తవ్యము. లేనిచో నవి జ్ఞానదీపమును రూపుమాపి యనర్థగర్తమున దింపును. అందుచే నోయర్జునా! కౌరవసేనకంటె మునుముం దీకాముని జయింపుమని పురికొల్పెను.

ఇంకను దైవాసుర సంపద్విభాగ యోగమను 16వ అధ్యాయమున దైవీసంపద నొకింత చెప్పి అసురసంపదను చెప్పుటలో "దంభో దర్పోఽభిమానశ్చ" యని సెలవిచ్చెను. ఇందు దుర్గుణముగా పరిగణింపబడిన అభిమాన మనగా, అభిజనవిద్యాధన దురభిమానమే. ఇట్లనేకస్థలములలో నీమదత్రయ పరిత్యాగము నొక ప్రధానసాధనముగా నుపదేశించెను.

## 21. ఆహారనియమము

ఇయ్యది రామానుజదర్శనముననే మిక్కిలి కట్టుబాటులతో పాటింపబడు ముఖ్యధర్మము. ముముక్షువులకిది ముఖ్యతమము. ముముక్షువులకేగాదు బాగుపడదలంచువారి కెల్ల నిది ప్రథమసోపానము.

ఉపనిషత్తులలో నీయాహారనియమ మెంతగ నాదరింపబడినదో గాంచుడు.

"ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః । సత్వశుద్ధౌ ధ్రువా స్మృతిః ।
స్మృతిలమ్భే సర్వగ్రంథీనాం విప్రమోక్షః ॥"

అనగా-ఆహారము పరిశుద్ధమైనచో నంతఃకరణ శుద్ధమగును. అది శుద్ధమైనచో నవిచ్ఛిన్నస్మృతి సంతానరూపమగు భక్తి సిద్ధించును. ఇక నేమున్నది. దానివలన కామక్రోధాదిగ్రంధు లన్నియు దుల్లిపోవు నని యీశ్రుతి చెప్పుచున్నది.

ఆహారమునకును అంతఃకరణమునకును గల సంబంధమును ఛాందోగ్యమునందలి సద్విద్యాప్రకరణ మెట్లు ప్రత్యక్షముగ ఋజువు చేయుచున్నదో గమనింపుడు

ఈప్రకరణమంతయు పితా పుత్ర సంవాదరూపమైనది. తండ్రి ఉద్దాలకుడు, కుమారుడు శ్వేతకేతువు. తండ్రి కుమారునితో—

"అన్నమయం హి సోమ్య మనః ఆపోమయః ప్రాణః ।

తేజోమయీ వాక్—ఇతి సూత్రప్రాయముగా నుపదేశించెను. దానిని విని శ్వేత కేతువు సాక్షాత్ స్పష్టముగా తెలిసికొనునట్లు ప్రత్యక్ష ప్రమాణముతో జూపుమనెను.

అంత నాతఁడు గట్టిగ కాచిన పెనుభాండమందున్న పెరుగు చిలుకబడినపుడు అడుగున కొంత పెరుగుండిపోవుటయు మధ్య మజ్జిగగా మారుటయు, వెన్నపైకి తేలుటయు చూచుచున్నావుకదా! అటులనే నీవు తినినయన్నముగూడ మూడువిధములుగ నీగర్భమున విభజింపబడి ఘనమగు భాగము మలముగ బయటకు పోయి, చల్లవంటి మధ్య భాగము నీ కండరములను పెంచి, వెన్నవంటి సూక్ష్మభాగము నీ మనస్సును సంస్కరించుననిచెప్పెను. అందులకు నిదర్శనముగా

తనబిడ్డను పదునైదుదినము లుపవసింపజేసెను. అట్లుపవసించి పదు నారవ దినమున నా శ్వేతకేతువు తనయొద్దకు రాగా నుద్దాలకు డాతని నొక వేదమంత్రమును చదివి యర్థమును చెప్పుమనగా 'న వై మా ప్రతి భాతి ఇతి' నాకేమియు జ్ఞాపకమువచ్చుట లేదనెను. తిరిగి క్రమ ముగా నన్నమును తిని రమ్మని యాదేశించెను. అతడట్లుచేసి 'యత్కి ఞ్చిన వ్రపచ్చ సర్వగ్ం హి ప్రతిపేదే' అడిగిన దంతయు చక్కగ చెప్పి దీనికేమికారణమని తండ్రిని ప్రశ్నించెను. అందుల కుద్దాలకుడు 'నాయనా! మనస్సు చంద్రునివలె పదహారు కళలతో నుండును. నీవు పదునైదురోజు లన్నము తినకుండుటచే నవి క్షీణించి నీ కేమియు జ్ఞాపకము లేకపోయెను. తిరిగి యవి యన్నముచే నాప్యాయితములై ప్రజ్వలించుచు నీకన్నిటిని స్మృతిపథమున సూంచెనని చెప్పెను. అంత నాశ్వేత కేతువు తెలిసినది తెలిసినదని నంతసించెను. దీనినిబట్టి మనము తినిన ఆహారమునకు మన మానస ప్రవృత్తులకును గల సం బంధము స్పష్టపరుచబడినది.

ఇందువల్లనే రామానుజ దర్శనమున నాలుగు ప్రధాన సూత్ర ములు పెద్దలచే ముఖ్యముగా పాటింపబడుచున్నవి.

1. ఎప్పుడు పడిన నప్పుడు 2. దేనిని పడిన దానిని 3. ఎక్క డపడిన నక్కడ 4. ఎట్లున్ననట్లు తినకుము అనునది చతుస్సూత్రి. దీనిని గీత యెట్లుపాటించుచున్నదో మనమొకింత పరికింతము.

కర్మయోగావశ్యకతను బోధించు తృతీయాధ్యాయమున—

"యజ్ఞ శిష్టాశిన స్సన్తః ముచ్యన్తే సర్వకిల్బిషైః
తే త్వఘం భుఞ్జతే పాపాః యే పచన్త్యాత్మ కారణాత్"

అనెడు 13వ శ్లోకమున "న్యాయార్జిత పదార్థములను" భగవంతునకు నివేదించి తినువారి పాపములన్నియును పటాపంచలై పోవును. కాని యట్లు చేయక తమపొట్టను నింపుకొనుటకే వండుకొనువారు మహాపాపులు. వారుతినునది పాపమేగాని యన్నముకాదు. అనికలదు.

మరియు తామసాహారములను గణించుటలో 17 వ అధ్యాయమున 'యాతయామం గతరసం ......... ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియం' అనెడు 10వ శ్లోకమున "అమేధ్యం" అనగా-మేధ్యం-యజ్ఞార్హం-భగవంతున కర్పింపదగినది. దానికి విరుద్ధమైనది అమేధ్యం-అనగా భగవంతునకు నివేదించరానిది. అదియు భగవంతునకు నివేదింపబడనిదియు తామసాహారమని చెప్పబడెను.

ఈనియమము రామానుజ సిద్ధాంతమున ప్రధానముగా పాటింపబడుచున్నది.

తాను తిను శాస్త్రసమ్మతమైన యేపదార్థమునుగాని, త్రాగు నీటినిగాని, ధరించిన వస్త్రాభరణాదులనుగాని, అనగా ధారక పోషక భోగ్యములగు పదార్థముల నన్నింటిని ముందు భగవంతుని యెదుట నుంచి

యర్పించి యాపిమ్మటనే వానిని తానుపయోగించుకొనవలె ననునది సనాతన వైష్ణవసిద్ధాంతము. ఇదిగీతఛాయనే యనువర్తించుచున్నదిగదా!

## 22. గీతాసారమే సారతమ చరమ మంత్రము

భగవద్గీతలోని 18వ అధ్యాయమందలి 65, 66 శ్లోకములు సారతమ శ్లోకములు. వీని యుపదేశమునకు ముందు భగవానుడర్జునునితో - 63వ శ్లోకమున—

"ఇతి తే జ్ఞాన మాఖ్యాతం। గుహ్యాద్గుహ్యతరం మయా।
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు ।"

అర్జునా! నేను నీకింతవరకు రహస్యములకెల్ల రహస్యతరమైన కర్మజ్ఞానభక్తియోగములకు సంబంధించిన జ్ఞానమును తెలిపితిని. దీని నంతను సాకల్యముగ విని విమర్శించుకొని నీయిష్టానుసారము చేయుము. అన విని యర్జునుడు 'యిదేమి? యింతవరకు నీవుపదేశించినదియు నేను విన్నదియు గుహ్యతరమా? ఇంకను గుహ్యతమము వినదగియున్నదా? ఈవినదాని నంతయును నేనిపుడు సమగ్రముగ విమర్శించవలెనా? విమర్శించి తోచినట్లు చేయవలెనా? ఇది నాతరమా? ఇక నే కడతేరుటెట్లని విలపించదొడంగెను. పరదుఃఖాసహిష్ణువగు నా దయామయుడు ప్రియమిత్రుని యా దుఃఖమును జూచి కరగిన హృదయముకలవాడై—

"సర్వగుహ్యతమం భూయ శ్శృణు మే పరమం వచః
ఇష్టోఽసి మే దృఢమితి । తతో వక్ష్యామి తే హితమ్॥"

అనెడు 18 వఅధ్యాయములోని 64 వ శ్లోకమున—

అన్నిరహస్యములలో రహస్యతమమైన ఉత్తమవాక్యమును చెప్పెద వినుము. నీవు నాకు మిక్కిలి ఇష్టుడవు. అందుచే నీకు హితమైనదానిని నేనే తెలిపెదను అనిసెలవిచ్చి యిష్టప్రాప్తిని యనిష్టవృత్తిని రెండు శ్లోకముల లో నుపదేశించెను. అందు"మన్మనాభవ" యనెడు 65 వ శ్లోకము "మామేవైష్యసి" నన్నే పొందుదువని యిష్టప్రాప్తిని. "సర్వధర్మాన్ ....సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" యనెడు 66 వ, శ్లోకమున అనిష్ట నివృత్తిని తెలిపెను.

అందవిష్ట నివృతియైనచో నిష్టప్రాప్తి తనంత నేసిద్ధించుచుగాన (అనిష్టనివృత్తి అనగా — మోక్షప్రతిబంధక పాపములయొక్క సమూల నిర్మూలనము) దానినే రామానుజ దర్శనావలంబు లాచార్యసమాశ్రయణ మొనరించి తప్త చక్రాంకితులై యూర్ధ్వపుండ్రముల ధరించి దాస్యనామము నుంచుకొని మహాత్తర మంత్రశ్రేష్ఠముగా బఠయుదురు, దీనికి చరమశ్లోకమని పెద్దలు పేరుంచిరి, అనగా మోక్షోపాయములలో నిక పైన లేదగు నుపాయమును (ప్రపత్తిని) తెలిపెడు శ్లోకమని యర్థము. దీని గౌరవమును అర్థగాంభీర్యమును లోకమున వెల్లడింగించు

టచే గోష్ఠీపూర్ణులు శ్రీరామానుజులంత మహాత్ములను పదునెనిమిది పర్యాయములు త్రిప్పిత్రిప్పి యనేకశపథములను చేయించి యుపదేశించిరి శ్రీరామానుజులును అర్థగౌరవము నాలోచించి నిగూఢముగా పూర్వాచార్యులు భద్రపరచిన ఈమంత్ర మంత్రార్థములను ప్రజల యనర్థగౌరవమునేగాంచి తామాచార్యాజ్ఞోల్లంఘన మొనర్చినచో సంభవించు కుంభీపాకనరకమునైనను నరకుగొనక ఆర్తిగల ప్రజల కందరకు నీ రహస్యమును వెదజల్లి వేసిరి.

చూడుడు గీతాసారతమ శ్లోకమున నీసంప్రదాయస్థుల కెంత ఆదరమో! గీత నింతగా నభిమానించు మతము మరియొకటి కలదని యెవ్వరైనను చెప్ప సాహసించగలరా!

ఇక రామానుజదర్శనము సర్వాత్మనా భగవద్గీతాపాదచ్ఛాయను రేఖామాత్రమైనను తప్పక వర్తించుచున్నదని ఋజువుచేయుట కింకను యిట్టి యుదాహరణము లెన్నియో జూపవచ్చును. గాని గ్రంథవిస్తర భీతిచే విరమించుచున్నాను.

ఈ నాకృషి, రామానుజ దర్శనము ఔపనిషదమని ఋజువు చేయుటకే యని పాఠకులు గ్రహింతురుగాక!